శ్రీ సాయీనిలయ ప్రచురణము : 7.

శ్రీ

# వేంకటేశ్వర సుప్రభాత గీతములు

మరియు

# శ్రీ లక్ష్మీనారాయణ స్తోత్రమంజరి



రచయిత : కీ. శే. శ్రీ బాపట్ల హనుమంతరావుగారు

ప్రచురణకర్త : బాపట్ల వేంకట పార్థసారథి

శ్రీ సాయీ నిలయమ్-చెరువు (పోస్టు) - 522 113.

# విషయసూచిక



# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 23 | ఆదాయ | ఆదాయ |
| | 26 | ప్రజసన్న | ప్రపన్న |
| 2 | 30 | దాసె | డాసె |
| 3 | 23 | విది | విధి |
| 4 | 14 | ధానః | థానాః |
| | 16 | తప | తవ |
| | 20 | వగన్ | వర్గ |
| 5 | 3 | మన్నంత | మన్ననంత |
| | 11 | నాధ | నాభ |
| 8 | 5 | రజతీ | రజనీ |
| | 19 | సలిప | సలుప |
| 9 | 13 | అనూపు | అనూపు |
| 17 | 7 | మది | మధి |
| | 29 | అది | ఆది |
| 18 | 18 | లిడదు | లిడుదు |
| 24 | 5 | రంక్షిచి | రక్షించి |
| 34 | 2 | హారతి | హరతి |

శ్రీ సాయినాథాయ నమః

# వి జ్ఞ ప్తి

భక్తమహాశయులారా !

శ్రీ సాయిభగవానుని అనుగ్రహమున చి. శ్రీ॰ రెబ్బాప్రగడ వెంకటరాజేశ్వర రావుగారి వదాన్యతన పూజ్యులు మా తండ్రి కీ. శే. బాపట్ల హనుమంతరావుగారనువదించిన శ్రీ వేంకటేశ్వర సుప్రభాత గీతములు, శ్రీ లక్ష్మీనారాయణ స్తోత్రమంజరి పునర్ముద్రణ గావించి మీకందించు భాగ్యము నాకు కలిగెను.

శ్రీ వేంకటేశ్వర సుప్రభాతము : శ్రీమన్నారాయణుడు తన యావాస స్థానమగు వైకుంఠమున కాలములేమి ప్రభాతము దుర్లభంబగుటచేత ప్రభాతగీత రూపమగు మహారాజ మర్యాదల కాశపడి, భువియందవతరించి, వేంకటాచలము నధిరోహించి, ఆంధ్రదేశాభిమానముచే నచ్చటనే నిలువబడి, మానవకోటి నుద్ధరింపబూని ప్రతిదిన మరుణోదయవేళ దేవభాషయందు పలుకు గీతములచే మేల్కొంచు నాదేవదేవుండు ఆంధ్రభాషాభిమానముచే నీ గీతములు మాతండ్రిగారిచేత నాంధ్రీకరించుకొని యానందించుచుండెను. శ్రీ వేంకటేశ్వర సుప్రభాతము, స్తోత్రము, ప్రపత్తి, మంగళా శాసనములను నాలుగు పాఠక శ్రోతలకు చతుర్విధ పురుషార్థములను సమకూర్చ గలవు.

శ్రీ లక్ష్మీనారాయణ స్తోత్రమంజరి : కరుణాస్వరూపిణియగు లక్ష్మీ సమేతుడై శ్రీమన్నారాయణుడు సకల లోకములను రక్షించుచున్నాడను విషయము పురాణేతిహాసములందు విస్పష్టముగ వివరింపబడినది. ఆస్తికుడైన మానవుడు అవ్యాజకరుణా సింధువగు శ్రీ భగవానుని కృపకు పాత్రుడగుటకై ఉత్తింపదగును శాస్త్రీయములగు సత్కర్మల నాచరించుటకు దేహబుద్ధి, ధనబలములు, వ్యవధి, జన సామాన్యమునకు దుర్లభమగుటచేత ఆస్వామి అనుగ్రహముబడయుటకు సులభ మార్గము నామస్మరణమే.

నిరాకారుడు, నిరంజనుడు, సర్వవ్యాపియునగు భగవానుని ఏ రూపమున ధ్యానించినను లోపములేదు. కాని తాముపాశించుదైవము సకల భూతహృదయాంతర్వర్తిగ గుర్తింపదగును.

సకల మతాచార్యులు, ప్రవక్తలు జీవులనుద్ధరించుటకై ఆయా దేశ కాల పాత్రానుగుణ్యములుగ మార్గముల నుద్దేశించిరి. అట్టి మహాపురుషులు, జగద్గురువులు

నగు శ్రీ శంకరాచార్య కృతములగు 1. శ్రీ కనకధార స్తవము 2. శ్రీ నారాయణ షట్పదీ స్తోత్రము 3. శ్రీ లక్ష్మీ నృసింహ స్తోత్రము 4. భజగోవింద స్తోత్రము 5. శ్రీ కులశేఖరు ఆళ్వారు విరచిత శ్రీ ముకుందమాల 6. శ్రీమాన్ నిగమాంత దేశిక విరచిత [శ్రీస్తుతి] కనకధారా స్తోత్రము సంస్కృత కృతులకు మాతండ్రిగారి ఆంధ్రీకరణమే యీకృతి.

ఈ స్తోత్ర షట్కము పాఠక శ్రోతలకు షడ్విధైశ్వర్యములను ప్రసాదించ గలదనుట నిస్సంశయము.

ముద్రణ విషయము : "శ్రీ సాయీనిలయ ప్రచురణము" ల పంపిణీకి, ఈ గ్రంథప్రతులు కొఱతపడుటయు, శ్రీ సాయీ కృపాప్రభావమున భక్త చింతామణియగు చి॥ శ్రీ రెబ్బాప్రగడ వేంకటరాజేశ్వరరావు (M.A.B.L. Advocate, Kovvur) గారికి, వారి ప్రథమ సతీమణి స్వర్గీయ "అనసూయ" జ్ఞాపకార్థముగ యీ గ్రంథము పునర్ముద్రణ గావించవలెనను సత్సంకల్పము పొడమటయు నొకే సమయమున సంఘటించి వారుదారముగ సమర్పించిన రు. 1516/- లు కానుకతో నియ్యది పునర్ముద్రితమైనది. ఈ సుగుణశాలికి, త్యాగశీలికి కృతజ్ఞతాపూర్వకముగ సాయీ ప్రభువు పలికించిన పద్యములు ప్రకటించుకొంటిని. నా కోరిక మన్నించి నాయందు వాత్సల్యానురాగము నెనడిగ చూపుచున్న కవిశేఖరులు పూజ్యశ్రీ మూలా పేరన్నశాస్త్రి గారు రచించిన యీ గ్రంథ ముద్రణవిషయాభినందనలును విడిగ ప్రకటింపడమైనది.

అనయము "గురుతుల్యుండ" ని
"జనకసముండ" నుచు నన్ను సంబోధించున్
వినయమునోర్పును గలని
య్యనఘుని రాజేశ్వరాయు నభినందింతున్.

ధనధాన్యంబులు, భూషణాంబరములున్, దారా, సుతల్, పుత్రులున్,
అనుకూలంబగు వృత్తి, మిత్రతతియున్ అత్యున్నతుల్ గల్గియున్
"అనసూయా" సతి నెంచుమంచి స్మృతిచిహ్నంబంచు, దా శాంతియున్
గన, "రాజేశ్వరు" డచ్చు గూర్చెనిది సంకల్పంబు సిద్ధించగన్.

శ్రీనివాసుడు నీకిచ్చు సిరులు మిగుల ! [శ్రీ వేంకటేశ్వర సుప్రభాత గీతములు]
కనకధారలు శ్రీలక్ష్మికరుణ గురియు ! [కనకధారా స్తవము - శ్రీస్తుతి]
శ్రేయముల గూర్చు నీకు నారాయణుండు ! [నారాయణ షట్పది]

# స్వర్గీయ రెబ్బాప్రగడ అనసూయ



చి. శ్రీ రెబ్బాప్రగడ వెంకట రాజేశ్వరరావు, M.A.,B.L.

కొవ్వూరు.



ఓ అనసూయా! సాధ్వీ! ఎన్ని జన్మలైనా నీ నిరంతర సహృదయ సంస్కార సాంగత్యః శక్తితో, శ్రీ సాయి సంరక్షతో శ్రేయోమార్గమున పయనింపదమునుగాక!

శ్రీ సాయి పాదపద్మములకు రచయిత ప్రణామమిడుట



గురువు గోవిందు లొక్కట నిల్చిరెదుట
బలుగ నెవ్వరి కాళ్ళఁ బడువాఁడ ? మొదట
హరి దర్శనంపు భాగ్యముఁ గూర్చు ప్రోడ
గురు ! సాయి ! నీకు మ్రొక్కుచునున్నవాఁడ !

[ రచయిత ]

క్షేమముల నిడు లక్ష్మీ నృశింహవిభుడు ! [శ్రీలక్ష్మీనృశింహ స్తోత్రము]
అందుకొందువు యశము ముకుందు కృపను ! [ముకుందమాల]
పాయు మోహము గోవిందు భజన మహిమ ! [భజగోవింద స్తోత్రం]
సకల దైవస్వరూపుండు, సద్గురుండు
సాయి రక్షించు రాజేశ్వరాయ ! నిన్ను !

ఆరాధించును నీదుపాదములు నిత్యంబెంతొ నిష్ఠాతుడై
భారంబెంచక గ్రంథముద్రణకు ద్రవ్యంబిచ్చె సద్భక్తితో
శ్రీ రెబ్బాప్రగడాన్వయార్య విజయశ్రీ లన్ ప్రమోదించగా
మా రాజేశ్వరరావు నెల్లెడల సంరక్షించు సాయీశ్వరా !

మహాభక్తాగ్రేసరులందరకు నమస్సులు!

శ్రీ సాయీనిలయమ్,
చెరువు—ప్రభవ—మార్గశిరము.

ఇట్లు, శ్రీసాయీ సేవలో,
బాపట్ల వేంకటపార్థసారధి

# అభినందనము

[ శ్రీ రెబ్బాప్రగడ వేంకట రాజేశ్వరరావుగారు ]

శ్రీ విభాజదహస్కరాన్వయమునన్ జిత్రమ్ముగాఁ బుట్టి స
ద్భావుండై మునిజన్నమున్ మనిచి కాంతాశాపమున్ బాపి పెం
ఱవన్ శంకరు చాపమున్ విఱిచి శ్రీ సీతాసతీపాణి రా
జీవంబుల్ గయికొన్న రాఘవుఁడు రక్షించు సదా మిమ్ములన్. 1

మ॥ ధనమున్ ధాన్యము దాతృతాగరిమమున్ ధైర్యమ్ము, సత్యమ్ము, స
జ్జనసాంగత్యముఁ బండితాదరము, భాషాసేవ, వేదాంత భా
వన సాయీశుని పాదభక్తియును రెబ్బాప్రెగ్గడోత్కృష్ట వం
శ్యుని రాజేశ్వరరాయభూసురుని సొమ్ముల్‌గా విరాజిల్లెడున్. 2

శా॥ రెబ్బాప్రెగ్గడవంశవార్నిధిశశిన్ శ్రీమాన్య రాజేశ్వరున్
గబ్బంబుల్ వెలయించు నేర్పరిని లోకక్షేమకృద్భావునిన్
పబ్బంబై భవమెల్ల భాసిలగ సర్వశ్రేయముల్ సర్వథా
యబ్బన్ జేయుచుఁ బ్రోచుగాక హరినిత్యానందసంధాయియై. 3

చ॥ కృతులు రచించి మించుటయుఁ గీర్తినొసంగెడునట్టి సత్కృతి
ప్రతతుల నంకితమ్ములుగఁ బన్ననగైకొను టాంధ్రదేశ సం
స్థితులు నియోగివంశజుల సిద్ధగుణంబులుగానెసంగవే ?
వితతగుణాఢ్య ! నేఁడు నిలఁబెట్టితివానిని యోగ్యులెన్నఁగన్. 4

కం॥ శ్రీ రెబ్బాప్రెగడాన్వయ
నీరధిజై వాత్సకుండు నిష్ఠాపరుఁడున్
శ్రీ రాజేశ్వరరాయ మ
హారాజద్గుణశాలిఁ బ్రోచు హరి సతతమున్. 5

మ॥ రణరత్నంబలయశ్వరాజము, కళారత్నంబు కావ్యంబు స
న్మణిరత్నంబల కోహినూరు, నృపరత్నంబల్లరాముండు, వా
రణరత్నం బమరేంద్రవాహము, నభోరత్నంబు సూర్యుండు స్త్రీ
జనరత్నం 'బనసూయ' యంచు బుధసంశ్లాఘలన్ గాంచెన్ ధరన్. 6

సీ॥ సంస్కృతాంగ్లాంధ్రభాషాపయోరాశులు
పరుస గ్రోలిన కుంభసంభవుండు
గద్యపద్యమ్ముల గణనకెక్కిన కృతుల్
విరచించియున్నట్టి విజ్ఞమూర్తి
శిరీశ్వరాస్థాన సిద్ధకవీంద్రుఁడై
వన్నెకెక్కినయట్టి ప్రాజ్ఞమూర్తి
సజ్జన స్తవనీయ శమదమాది సుగుణ
సంపత్తి గల్గిన సౌమ్యమూర్తి

గీ॥ రమ్య బాపట్ల హనుమంతరాయ సుకవి
రచనమై నట్టి లక్ష్మీనారాయణ నుతిఁ
బ్రథితమంజరిఁ దమితోడ బ్రథమ భార్య
స్మృతిగ నచ్చును గూర్చె రాజేశ్వరుండు. 7

కం॥ అనసూయ సతముఁ గల్గిన
యనసూయాసతి త్రిదివము కరుగంగను నా
పనిత మనశ్శాంతికి స
ద్ఘనకృతి ముద్రించి యొసఁగెఁ దత్పతి ప్రేమన్. 8

ఇట్లు,
కవిశేఖర శ్రీ మూలా పేరన్నశాస్త్రిగారు,
విజయనగరం.

[illegible]వంబరు, 1937.

# శ్రీ పద్మావతీ దేవి



మానాతీత ప్రదిత విభవాం మంగళం మంగళానాం
వక్షః పీఠీం మధు విజయినో భూషయంతీం స్వకాంత్యా
ప్రత్యక్షానుశ్రవిక మహిమ ప్రార్థినీనాం ప్రజానాం
శ్రేయోమూర్తిం శ్రియ మశరణస్త్వాం శరణ్యాం ప్రపద్యే.

# శ్రీ వేంకటేశ్వరస్వామి



హైమోర్ధ్వపుండ్రమజహన్మకుటం సునాసం
మందస్మితం మకరకుండల చారు గండం
బింబాధరం బహుళ దీర్ఘ కృపాకటాక్షం
శ్రీ వేంకటేశ మమ మూర్తి విభావయేఽహమ్.

శ్రీరస్తు

శ్రీ వేంకటేశ్వరాయనమః

# శ్రీ వేంకటేశ్వర సుప్రభాతము

## తెలుగు – గీతములు

కౌసల్యా సుప్రజారామ పూర్వాసంధ్యా ప్రవర్తతే।
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికమ్॥

శ్రీ వినుత కోసలాత్మజా ప్రియతనూజ! నిద్రమేల్కొనఁగదె, రామభద్ర! లెమ్ము,
వేగుజామయ్యెఁ, దూరుపువెల్లఁబాఱెఁ, గాల విధులఁదీర్ప నరశార్దూల! లెమ్ము.

ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద ఉత్తిష్ఠ గరుడధ్వజ।
ఉత్తిష్ఠకమలాకాన్త త్రైలోక్యం మంగళం కురు॥

లేపగదవయ్య! గోవింద! లెమ్ము-లెమ్ము లెమ్ము-గరుడకేతన! నిద్రలెమ్ము-తండ్రి!
శ్రీసతీ హృత్కమల చంచరీక! లెమ్ము-లోక శుభములఁగూర్ప మేల్కొమ్ము-దేవ!

మాతస్సమస్త జగతాం మధుకైటభారేః
వక్షోవిహారిణి మనోహర దివ్యమూర్తే।
శ్రీ స్వామిని శ్రితజన ప్రియదానశీలే
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్॥

జగములకు తల్లి! విష్ణు వత్సంబునందు మెలఁగు దేవి! మనోహర లలిత రూప!
వినమితార్థ ప్రదాయిని! వేంకటేశ దయితరో! యిదె-సుప్రభాతంబు-నీకు.

తవ సుప్రభాత మరవిందలోచనే
భవతు ప్రసన్న ముఖచంద్ర మండలే।
విధిశంకరేన్ద్ర వనితాభిరర్చితే
వృషశైలనాథ దయితే దయానిధే॥

కరుణ శ్రితులపై వర్షించు కమలనేత్రి! మందహాస శోభిత శరదిందు వదన!
సకల సుర సతీ సేవిత చరణ యుగళ! సుప్రభాతంబు-వేంకటేశ ప్రణయిని!

అత్ర్యాది సప్తఋషయస్సముపాస్య సంధ్యాం
ఆకాశసింధు కమలాని మనోహరాణి
ఆదాయ పాదయుగ మర్చయితుం ప్రసన్నాః
శేషాద్రి శేఖరవిభో తవసుప్రభాతమ్॥

సాంధ్యకృత్యముల్ తీరిచి సప్త ఋషులు దివ్య గంగాంబుజంబులఁ దెచ్చి, నీదు
పద సమర్చనసలుపఁ బ్రసన్నులైరి; స్వామి! శేషాద్రివిభు! సుప్రభాతమయ్య!

పంచాననాబ్జ భవషణ్ముఖ వాసవాద్యాః
త్రైవిక్రమాది చరితం విబుధాః స్తువంతిః
భాషాపతిః పఠతి వాసరశుద్ధిమారాత్
శేషాద్రి శేఖరవిభో తవ సుప్రభాతమ్॥

విధి హర కుమార శక్రాది విబుధచయము సంస్తుతింప త్రైవిక్రమ చరితములను,
దివిజ గురుఁడు వాసర శుద్ధిఁదెలుపువాడు; స్వామి! శేషాద్రివిభు! సుప్రభాతమయ్య!

ఈషత్ప్రఫుల్ల సరసీరుహ నారికేళ
పూగద్రుమాది సుమనోహర పాలికానాం
ఆవాతి మందమనిలః సహ దివ్యగంధైః
శేషాద్రి శేఖరవిభో తవ సుప్రభాతమ్॥

అర విరిసిన తామరల నల్లల్ల నూపి పోక కొబ్బరి మోసుల జోకదాఁటి,
సురభిళంబులై పిల్ల తెమ్మెరలు సాగె; స్వామి! శేషాద్రివిభు! సుప్రభాతమయ్య!

ఉన్మీల్య నేత్రయుగముత్తమ పంజరస్థాః
పాత్రావసిష్ట కదలీ ఫలపాయసాని
భుక్త్వాసలీలమథ కేళిశుకాః పఠంతి
శేషాద్రి శేఖరవిభో తవ సుప్రభాతమ్॥

లీలఁ బంజరంబులను గేళీ శుకములు కనులఁ దెఱచి శేషించిన యనఁటిపండ్లు
పాయసములాని నీ స్తుతుల్ పలుకుచుండె, స్వామి! శేషాద్రివిభు! సుప్రభాతమయ్య!

తంత్రీప్రకర్ష మధురస్వనయా విపంచ్యా
గాయతనంత చరితం తవ నారదోఽపి।
భాషాసమగ్ర మసకృత్కరచార రమ్యం
శేషాద్రి శేఖరవిభో తవ సుప్రభాతమ్॥

మహతి మీఁటి నటించుచు, మధుర నిస్వనములఁ బలుపుచు, నీ లీల లమరమౌని
యిదె-యశేష శేముషినిఁ గీర్తించుచుండె; స్వామి! శేషాద్రివిభు! సుప్రభాతమయ్య!

భృంగావళీ చ మకరంద రసానువిద్ధ
ఝుంకారగీత వినదైః సహసేవనాయ।
నిర్యాత్యుపాంత సరసీ కమలోదరేభ్యః
శేషాద్రి శేఖరవిభో తవ సుప్రభాతమ్॥

ప్రాంత కాసార కమల గర్భముల వీడి మత్తమధుపముల్ ఝుంకృతి మధురగీత
నినదముల దాసె గుమిగూడి నిను భజింప; స్వామి! శేషాద్రివిభు! సుప్రభాతమయ్య!

యోషాగణేన వరదధ్ని విమథ్యమానే
ఘోషాలయేషు దధిమంథన తీవ్రఘోషాః
రోషాత్కలిం విదధతే కకుభశ్చ కుంభాః
శేషాద్రి శేఖరవిభో తవ సుప్రభాతమ్॥

కృష్ణలీలలఁ బాడుచు వ్రేత లెలమిఁ దధినిఁ జిలుకఁగ వెడలు శబ్దముల మ్రోగు
సకలదిశలును గడవలు జగడమాడె; స్వామి! శేషాద్రివిభు! సుప్రభాతమయ్య!

పద్మేశమిత్ర శతపత్ర గతాళివర్గాః
హర్తుం శ్రియం కువలయస్య నిజాంగలక్ష్మ్యాః
భేరీనినాదమివ బిభ్రతి తీవ్రనాదం
శేషాద్రి శేఖరవిభో తవ సుప్రభాతమ్॥

సవితృ హితకంజములఁ దేంట్లు స్వతదుకాంతిఁ గువలయాంగ లక్ష్మిని నాఁచికొనఁగ భేరి
మొఱసెనా ఝుంకృతి నినాదములను బఱపె; స్వామి! శేషాద్రివిభు! సుప్రభాతమయ్య!

శ్రీమన్నభీష్ట వరదాఖిల లోకబంధో
శ్రీ శ్రీనివాస జగదేక దయైకసింధో
శ్రీ దేవతాగృహ భుజాంతర దివ్యమూర్తే
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్॥

శ్రీకరా! శ్రితాభీష్టద! లోకబంధు! శ్రీనివాస! లోకైక దయానిధాన!
ఇందిరా లయోరస్థల సుందరాంగ! స్వామి! వేంకటేశ్వర! సుప్రభాతమయ్య!

శ్రీస్వామి పుష్కరిణికాఽప్లవ నిర్మలాంగాః
శ్రేయోర్థినో హరవిరించి సనందనాద్యాః
ద్వారేవసంతి వరవేత్ర హతోత్తమాంగాః
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్॥

తిరుకొలంకునఁ దోఁగి శుద్ధిని గడించి మృడ విధి సనందనాదులు మేలు గోరి,
బన్నములకోర్చి వాకిటనున్నవారు; స్వామి! వేంకటేశ్వర! సుప్రభాతమయ్య!

శ్రీ శేషశైల గరుడాచల వేంకటాద్రి
నారాయణాద్రి వృషభాద్రి వృషాద్రి ముఖ్యామ్
ఆఖ్యాం త్వదీయవశతేరనిశం వదంతి
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్॥

వేఁకటాద్రియు, శేషాద్రి, వృషభగిరి, వృషాద్రి, గరుడాద్రి, నారాయణాద్రి, ముఖ్య
నామములనెంత్రు నీ పరంధామమెపుడు; స్వామి! వేంకటేశ్వర! సుప్రభాతమయ్య!

సేవాపరాః శివసురేశ కృశానుధర్మ
రక్షోంబునాథ పవమాన ధనాధినాథాః
బద్ధాంజలి ప్రవిలసన్నిజ శీర్షదేశాః
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్॥

మృడ మహేంద్రాగ్ని ధర్మ రాత్రి చర వరుణ పవనధనదులు సేవింపవచ్చి, నిలచి,
నిటల తట ఘటితాంజలి పుటులునైరి; స్వామి! వేంకటేశ్వర! సుప్రభాతమయ్య!

ధాటీషతే విహగరాజ మృగాధిరాజ
నాగాధిరాజ గజరాజ హయాధిరాజాః
స్వస్వాధికార మహిమాది కమర్థయంతే
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్॥

వినతి, వహిరాజు, మృగరాజు, విహగరాజు, నశ్వరాజును, గజరాజు స్వాధికార
శక్తులడుగవచ్చిరి నీదు స్వాతులందు; స్వామి! వేంకటేశ్వర! సుప్రభాతమయ్య!

సూర్యేందుభౌమ బుధవాక్పతి కావ్యశౌరి
స్వర్భానుకేతు దివిషత్పరిషత్ప్రధానః
త్వద్దాసదాస చరమావధి దాసదాసాః
శ్రీ వేంకటాచలపతే తప సుప్రభాతమ్॥

సూర్య శశి కుజ బుధ గురు శుక్ర మంద రాహు కేతులు సురసభా రాధ్యులిటకు
దాస దాసానుదాసులై తడిసినారు; స్వామి! వేంకటేశ్వర! సుప్రభాతమయ్య!

త్వత్పాదధూళిభరితస్ఫురితోత్తమాంగాః
స్వర్గాపవర్గ నిరపేక్ష నిజాంతరంగాః
కల్పాగమాకలనయాఽఽకులతాం లభంతే
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్॥

తలల నీ పదరజమును దాల్చువారు వాంఛసేయక స్వర్గాప వర్గములను
గలతఁగాంతురు రాఁబోవు కల్పమెంచి, స్వామి! వేంకటేశ్వర! సుప్రభాతమయ్య!

త్వద్గోపురాగ్ర శిఖరాణి నిరీక్షమాణాః
స్వర్గాపవర్గ పదవీం పరమాం శ్రయంతః
మర్త్యా మనుష్యభువనే మతిమాశ్రయంతే
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్॥

స్వర్గ మోక్షమార్గంబులఁ బనెడు జనులు నీదుగోపుర శిఖరముల్ నెమ్మిఁగాంచి
మనుజలోక నివాసంపు మతినిఁగంద్రు; స్వామి! వేంకటేశ్వర! సుప్రభాతమయ్య!

శ్రీభూమినాయక దయాది గుణామృతాబ్ధే
దేవాధిదేవ జగదేక శరణ్యమూర్తే
శ్రీమన్ననంత గరుడాధిభిరర్చితాంఘ్రే
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్॥

శ్రీ మహీనాథ! కరుణా రసామృతాబ్ధి! త్రిభువనైక శరణ్య! శ్రీ దేవ దేవ!
శేష గరుడ ముఖ్యాశ్రితార్చిత పదాబ్జ! స్వామి! వేంకటేశ్వర! సుప్రభాతమయ్య!

శ్రీపద్మనాభ పురుషోత్తమ వాసుదేవ
వైకుంఠ మాధవ జనార్ధన చక్రపాణే
శ్రీవత్సచిహ్న శరణాగత పారిజాత
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్॥

వాసుదేవ! వైకుంఠ! శ్రీవత్స చిహ్న! జలజనాభ! జనార్ధన! చకహస్త!
దాస మందార! పురుషోత్తమ రమేశ! స్వామి! వేంకటేశ్వర! సుప్రభాతమయ్య!

కందర్పదర్ప హరసుందర దివ్యమూర్తే
కాంతాకుచాంబురుహ కుట్మల లోలదృష్టే
కల్యాణనిర్మల గుణాకర దివ్యకీర్తే
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్॥

మార గర్వాపహార రమ్యస్వరూప! రాజ్యలక్ష్మి కుచాంభోజ రాజహంస!
అమల కల్యాణగుణ నిలయాచ్ఛకీర్తి స్వామి. వేంకటేశ్వర! సుప్రభాతమయ్య!

మీనాకృతే కమఠకోల నృసింహవర్ణిన్
స్వామిన్ పరశ్వథ తపోధన రామచంద్ర
శేషాంశరామ యదునందన కల్కిరూప
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్॥

మీనకమఠ వరహ లక్ష్మినృసింహ వటు పరశురామ రఘురామ బలవిశేష
రామకృష్ణ కల్క్యాది భద్రావతార! స్వామి! వేంకటేశ్వర! సుప్రభాతమయ్య!

భాస్వాను దేతి వికచాని సరోరుహాణి
సంపూర్ణయంతి నినదైః కకుభో విహంగాః
శ్రీవైష్ణవాః సతతమర్థిత మంగళాస్తే
ధామాశ్రయంతి తవ వేంకట సుప్రభాతమ్॥

పచ్చకర్పూర మేలకులు లవంగములను బరిమళించు గంగావారి భరిత హేమ
కలశములఁ బూని విప్రుల నిలచి రెలమి; స్వామి! వేంకటేశ్వర! సుప్రభాతమయ్య!

ఏలాలవంగ ఘనసార సుగంధితీర్థం
దివ్యం వియత్సరితి హేమఘటేషు పూర్ణమ్
ధృత్వాద్య వైదిక శిఖామణయః ప్రహృష్టాః
తిష్ఠంతి వేంకటపతే తవ సుప్రభాతమ్॥

భానుఁ డుదయించె, వికసించె వారిజములు పతగములు కలధ్వనుల దిక్తతుల నింపె;
వైష్ణవులు శుభాకాంక్షఁ బ్రసన్నులైరి; స్వామి! వేంకటేశ్వర! సుప్రభాతమయ్య!

బ్రహ్మాదయస్సురవరాస్సమహర్షయస్తే
సంతస్సనందన ముఖాస్త్వథ యోగివర్యాః
ధామాంతికే తవహి మంగళ వస్తుహస్తాః
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్॥

అబ్జగర్భాది సురలు మహర్షివరులు యోగులు సనందనాదులు యోగ్యవస్తు
హస్తులై నిల్చిరీ నిలయంబు కెలన; స్వామి! వేంకటేశ్వర! సుప్రభాతమయ్య!

లక్ష్మీనివాస నిరవద్య గుణైకసింధో
సంసారసాగర సముత్తరణైకసేతో
వేదాంత వేద్య నిజవైభవ భక్తభోగ్య
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్॥

శ్రీనివాస! సద్గుణ గణ శ్రీవిలాస! అమిత భవవార్ధి సంతరణైకతరణి!
ఆగమాంతైక వేద్య! భక్తైక భోగ్య! స్వామి! వేంకటేశ్వర! సుప్రభాతమయ్య!

ఇత్థం వృషాచలపతేరిహ సుప్రభాతమ్
యే మానవాః ప్రతిదినం పఠితుం ప్రవృత్తాః
తేషాం ప్రభాతసమయే స్మృతిరంగ భాజాం
ప్రజ్ఞాం పరార్థసులభాం పరమాం ప్రసూతే॥

స్వామి వేంకటేశ్వర సుప్రభాత గీతమాల ననుదినంబు ప్రభాతవేళయందుఁ
బలుకు వారల కీ స్మృతి ప్రార్థనీయ పరమపదలబ్ధి కనువైన ప్రజ్ఞ నొసఁగు.

శ్రీ వేంకటేశ్వర సుప్రభాతమ్ సమాప్తమ్.

# శ్రీ వేంకటేశ్వర స్తోత్రమ్

కమలా కుచచూ చుకకుంకుమతో
నియతారుణితాతుల నీలతనో
కమలాయతలోచన లోకపతే
విజయీభవ వేంకట శైలపతే॥

శ్రీరమాస్తన దివ్య సింధూర నియమి తారుణిత కోమరాసమ శ్యామలాంగ;
సరసిజాతాక్ష! భువనైక సార్వభౌమ! జయము! విజయంబు! ! వేంకటశైలనాథ!

స చతుర్ముఖ షణ్ముఖ పంచముఖ
ప్రముఖాఖిల దైవతమౌళిమణే
శరణాగతవత్సల సారనిధే
పరిపాలయ మాం వృషశైలపతే॥

సరసిజానన శంకర షణ్ముఖాది సకల సురమౌళి మణి దీప్త చరణపీఠ!
ఆశ్రితావన! సారదయా నిధాన! జయము! రక్షింపు-శ్రీ శేషశైలనాథ!

అతివేలతయా తవదుర్విషహైః
అనువేలకృతైరపరాధశతైః
భరితం త్వరితం వృషశైలపతే
పరయా కృపయా పరిపాహి హరే॥

స్వైరినై మేరమీటి నీ సైపఁబోని వేలకొలఁది నేరములఁ గావించుచుంటి;
శరణుఁజొచ్చు వీని నపార పరమ కరుణ నేలఁగదె! వేగ, శ్రీ వృషశైలనాథ!

అధివేంకటశైల ముదారమతేః
జనతాభి మతాధిక దానరతాత్
పరదేవతయా గదితాన్నిగమైః
కమలాదయితాన్న పరంకలయే॥

మనుజులడుగు కోర్కెలకు వేమడుఁగులొసఁగు సామి, వౌదార్యబుద్ధి విశాలుండీవు;
శ్రుతులు పరతత్త్వముగ నిన్నునుతులొనర్చు వింక నీ కన్యమెఱుఁగ, శ్రీ వేంకటేశ!

కలవేణురవా శతగోపవధూ
శతకోటి వృతాత్స్మర కోటిసమాత్
ప్రతివల్లవికాభి మతాత్సుఖదాత్
వసుదేవసుతాన్న పరం కలయే॥

మురళి రవళికిఁ జొక్కు వేవ్రే గరితలకు నొకొక్కరకు నొక్కఁడై శతకోటి మోహ
నాకృతినిఁబోల్చు కృష్ణుఁడవైన నీకు నన్యమెఱుఁగను; శ్రీ గరుడాద్రినాథ!

అభిరామ గుణాకర దాశరథే జగదేక ధనుర్ధర ధీరమతే
రఘునాయకరామ రమేశవిభో వరదో భవదేయ దయాజలధే॥

త్రిభువనైక ధనుర్ధర! ధీరతేజ! రఘువరా! రమాప్రియ! దశరథ తనూజ!
ప్రకట గుణధామ! జగదభిరామ! రామ! అభయమిడవె-దయాబ్ధి! వృషాద్రినాథ!

అవనీతనయా కమనీయకరం రజనీకరచారు ముఖాంబురుహమ్
రజనీచర రాజతమోమిహిరం మహనీయమహం రఘురామమయే॥

చటుల దైత్యేశ తిమిర ప్రచండ తపను, శారదా పూర్ణచంద్రాస్యు, సారసాక్షు,
జనకజా మనోహరు, దయాసాంద్రు, రామచంద్రు నిన్నెంతు శ్రీ శేషశైలనాథ!

సుముఖం సుహృదం సులభం సుఖదం స్వనుజం చ సుఖాయ మమోఘశరమ్
అపహాయ రఘూద్వహ మన్యమహం న కథంచ స కంచ న జాతుభజే॥

సుముఖు సుహృదుని సుఖదుని నమితసురేశు, మోహన వినీలదేహు, నమోఘశరుని
వినుత సద్భ్రాతృయుతు రఘువీరు నిన్ను విడిచి యన్యు నేకెల్లెంతు? వేంకటేశ!

వినా వేంకటేశం న నాథో న నాథః సదా వేంకటేశం స్మరామి స్మరామి
హరే వేంకటేశ ప్రసీద ప్రసీద ప్రియం వేంకటేశ ప్రయచ్ఛ ప్రయచ్ఛ॥

లేడు నాకు వేంకటుని మించు ఱేడు లేడు, ఎంతు శ్రీ వేంకటేశ్వరు నెంతు సతము,
కృపఁ గనవె వేంకటేశ్వరా! కృపను గనవె, ఇడవె-శ్రీవేంకటేశ! యభీష్ట మిడవె.

అహం దూరతస్తే పదాంభోజయుగ్మ ప్రణామేచ్ఛయాఽఽగత్య సేవాంకరోమి
సకృత్సేవయా నిత్య సేవాఫలం త్వం ప్రయచ్ఛ ప్రయచ్ఛ ప్రభో వేంకటేశ॥

దవ్వనక నీదు పాదపద్మ ద్వయంబు ప్రణతి సలిప సేవింపఁగ వచ్చి, యొకటఁ
జఅపితిని సేవ; నిత్యసేవాఫలంబుఁ బ్రేమ నీయవె! యిడవె! శ్రీ వేంకటేశ!

అజ్ఞానినా మయా దోషా న శేషాన్విహితాన్ హరే
క్షమస్వ త్వం క్షమస్వ త్వం శేషశైల శిఖామణే॥

మోహవారాశి యందున మునిఁగియుంటి సలిపినాఁడ దోసములు లక్షల కొలంది;
కృప క్షమింపుమీ-నన్ను క్షమించఁ గదవె! స్వామి! వేంకటేశ్వర శేషశైలనాథ!

శ్రీ వేంకటేశ్వర స్తోత్రమ్ సమాప్తమ్

# శ్రీ వేంకటేశ్వర ప్రపత్తి

ఈశానాం జగతోఽస్య వేంకటపతేర్విష్ణోః పరాం ప్రేయసీం
తద్వక్షస్థల నిత్యవాసరసికాం తత్క్షాంతి సంవర్ధినీమ్
పద్మాలంకృత పాణిపల్లవయుగాం పద్మాసనస్థాం శ్రియం
వాత్సల్యాది గుణోజ్జ్వలాం భగవతీంవందే జగన్మాతరమ్॥

హరికిఁ బ్రియమెచ్చ నెద నిచ్చలదివసించి, యోర్పుఁ బెనుచుచు జగములనోము జనని, వనజహస్త, వాత్సల్యాది గుణగణాఢ్య, దేవి భగవతిన్ బద్మావతిని భజింతు.

శ్రీమన్ కృపాజలనిధే కృతసర్వలోక
సర్వజ్ఞ శక్త నతవత్సల సర్వశేషిన్
స్వామిన్ సుశీల సులభాశ్రిత పారిజాత
శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే॥

శ్రీకర! కృపాంబునిధి! సర్వలోక కర్త! సర్వబలయుత! సర్వజ్ఞ! సర్వశేషి! భక్తవత్సల! శ్రితజన పారిజాత! స్వామి! వేంకటేశ! నీ పదాబ్జములు శరణు.

ఆనూపురార్పిత సుజాత సుగంధిపుష్ప
సౌరభ్యసౌరభకరౌ సమసన్నివేశౌ
సౌమ్యౌ సదాఽనుభవనేఽపి నవానుభావ్యౌ
శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే॥

సౌమ్యగతిఁ బొల్చి యొండొంటి సరసఁ బఱగి మూర్కొను సుమాళి పరిమళమునకుఁ బరిమళంబిడి, నవ నిత్యాను భావ్యంబులైన స్వామి వేంకటేశ్వరు పదాబ్జములు శరణు.

సద్యోవికాసి సముదిత్వ రసాంద్రరాగ
సౌరభ్య నిర్భర సరోరుహ సామ్యవార్తామ్
సమ్యక్షు సాహసపదేషు విలేఖయంతౌ
శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే॥

అపుడు విచ్చి సొంపుల తుదురై సుగంధ మీనుసారసంబుల నుపమించు నెడలఁ బలుకు సాహస మది యని తెలియఁజేయు స్వామి వేంకటేశ్వరు పదాబ్జములు శరణు.

రేఖామయధ్వజ సుధాకల శాతపత్ర
వజ్రాంకుశాంబురుహ కల్పక శంఖచక్రైః
భవ్యైరలంకృతతలౌ పరతత్త్వచిహ్నైః
శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే॥

అమృత కల శాత పత్ర వజ్రాంకుశ ధ్వజాబ్జ శంఖచక్రాది రేఖాంకితములు, సిద్ధ పరతత్త్వ చిహ్న లక్షిత తలములు, స్వామి వేంకటేశ్వరు పదాబ్జములు శరణు.

తా\[మోదరద్యుతి పరాజిత పద్మరాగౌ
బాహ్యైర్మహోభిరభి భూత మహేంద్రనీలౌ
ఉద్యన్నఖాంశుభిరుదస్త శశాంకభాసౌ
శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే॥

పొసఁగు నఖకాళ్ల తేజు కెంపులను గేరఁ జిక్క మీఁగాళ్ల వెలుఁగు పచ్చలను దెగడ, నఖచయోద్ద్యుతుల్ శశిరుచిన్ నవ్వఁ బొలుచు స్వామి వేంకటేశ్వరు పదాబ్జములు శరణు.

సప్రేమభీతి కమలాకర పల్లవాభ్యాం
సంవాహనేపి సపదిక్లమమాదధానౌ
కాన్తావవాఙ్మన సగోచర సౌకుమార్యౌ
శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే॥

భయముఁ బ్రేమ దోఁపఁగఁ గర పల్లవములఁ బట్టి లచ్చియొత్తఁగఁ గందువాఱి, పలుకు దలఁపులకు నందఁబోని కోమలములైన స్వామి వేంకటేశ్వరు పదాబ్జములు శరణు.

లక్ష్మీమహీత దనురూప నిజానుభావ
నీలాది దివ్య మహిషీకర పల్లవానాం
ఆరుణ్య సంక్రమణతః కిలసాంద్రరాగౌ
శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే॥

పద్మజా మహీ నీలాది భవ్యసతుల హస్త పల్లవంబులఁ బొల్చు నరుణకాంతి సంక్రమించెనో యనఁ గెంపుచాయలీను స్వామి వేంకటేశ్వరు పదాబ్జములు శరణు.

నిత్యాఽఽనమద్విధి శివాది కిరీటకోటి
ప్రత్యుప్త దీప్త నవరత్నమహ ప్రరోహైః
నీరాజనావిధి ముదారముపాదధానౌ
శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే॥

అనుదినం బాదృతిని మ్రొక్కు నజ హరాది దివిజ కోటీర నవరత్న దీధితుల, నుదార నీరాజనార్చనల్ దగ వెలుంగు స్వామి వేంకటేశ్వరు పదాబ్జములు శరణు.

"విష్ణోః పదేపరమ" ఇత్యుదిత ప్రశంసౌ
యౌ "మధ్వఉత్స" ఇతి భోగ్యతయాఽప్యుపాత్తౌ
భూయస్తథేతి తవ పాణితల ప్రదిష్టౌ
శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే॥

అలరు విష్ణు పరంపద మందువేని "తేనెయూట"- భోగ్యంబని తెలుపు శ్రుతులు; 'ఇవవి'-యని సామి కేల్ ప్రదిష్టించు, నట్టి స్వామి వేంకటేశ్వరు పదాబ్జములు శరణు

పార్థాయ తత్సదృశ సారథినా త్వయైవ
యౌ దర్శితౌ స్వచరణౌ శరణం వ్రజేతి
భూయోఽపి మహ్యమిహ తౌ కరదర్శితౌ తే
శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే॥

పార్థునకు సారథిగ 'వేని' భారతాహవమున 'శరణమొందుమ'-యని ప్రభువు తెలిపె;
కరమునన్ వేని నిటఁజూపు మఱల-నట్టి స్వామి వేంకటేశ్వరు పదాబ్జములు శరణు.

మన్మూర్ధ్ని కాళియఫణే వికటాటవీషు
శ్రీ వేంకటాద్రిశిఖరే శిరసి శ్రుతీనామ్
చిత్తేఽప్యనన్యమనసాం సమమాహితౌ తే
శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే॥

ప్రస్తుత వృషాద్రిపైన, నా మస్తకమునఁ గాళియ ఫణాగ్రమున వేద మౌళి యందు ద
నన్య భక్తుల హృదయంబు లందుఁ బొలుచు స్వామి వేంకటేశ్వరు పదాబ్జములు శరణు

అమ్లానహృష్య దవనీతల కీర్ణపుష్పౌ
శ్రీ వేంకటాద్రి శిఖరాభరణాయమానౌ
ఆనందితాఖిల మనోనయనౌ తవైతౌ
శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే॥

పుడమి వాడకెల్లెడఁ బొల్చు పుష్పములును, పూత వేంకటాచల శిరో భూషణములు,
సకల జన మనో నయన హర్షప్రదములు స్వామి వేంకటేశ్వరు పదాబ్జములు శరణు.

ప్రాయః ప్రసన్నజనతా ప్రథమావగాహ్యౌ
మాతుః స్తనావివ శిశోరమృతాయమానౌ
ప్రాప్తౌ పరస్పర తులామ తులాంతరౌ తే
శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే॥

శ్రితజనాళికిఁ దొలుదొల్త సేవ్యములును పాపలకు స్తన్యమటు సుధాప్రాయములును,
సాటిలేని పరస్పర సామ్యములగు స్వామి వేంకటేశ్వరు పదాబ్జములు శరణు.

సత్త్వోత్తరైస్సతత సేవ్య పదాంబుజేన
సంసారతారక దయార్ద్ర దృగంచలేన
సౌమ్యోపయంతృమునినా మమదర్శితౌతే
శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే॥

సతత సాత్త్విక జన సమర్చిత పదాబ్జుఁ డమిత భవవార్ధి తరణ కటాక్షుఁ డనఁగఁ
దనరు మనవాళమునిచే ప్రదర్శితములు స్వామి వేంకటేశ్వరు పదాబ్జములు శరణు.

శ్రీ శ్రియా ఘటికయా త్వదుపాయభావే
ప్రాప్యే త్వయి స్వయముపేయ తయాస్ఫురంత్యా
నిత్యాశ్రితాయ నిరవద్య గుణాయతుభ్యం
స్యాం కింకరో వృషగిరీశ న జాతుమహ్యమ్॥

భవదుపాయమందున భవప్రాప్తియందు వెరవుఁ దెలుపుచుఁ బ్రాప్యయౌ సిరికి నిత్య శరణమగుదీవ; నీకుఁ గింకరుఁడ; నాకుఁ గింకరుఁడఁగా నిఁకెందు-శ్రీ వేంకటేశ!

శ్రీ వేంకటేశ్వర ప్రపత్తిః సమాప్తమ్.

# శ్రీ వేంకటేశ్వర మంగళాశాసనము

శ్రియః కాంతాయ కల్యాణనిధయే నిధయేఽర్థినామ్
శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్॥

శ్రీనితంబిని పతికిఁ గల్యాణ నిధికి సంతతాశ్రిత జన పారిజాతమునకు, ప్రథిత వేంకటశైల నివాసునకును మహిత శ్రీనివాసునకును శ్రీమంగళంబు.

లక్ష్మీసవిభ్రమాలోక సుభ్రూవిభ్రమ చక్షుషే
చక్షుషే సర్వలోకానాం వేంకటేశాయ మంగళమ్॥

భామల మెలపుచు బెళుకుఁ జూపులను బెళుపి కలుములవెలందిఁ గను సోయగముల దొరకు, సకల లోక చక్షువునకు సదయమతికి మహిత వేంకటేశ్వరునకు మంగళంబు.

శ్రీ వేంకటాద్రి శృంగాగ్ర మంగళాభరణాంఘ్రయే
మంగళానాం నివాసాయ వేంకటేశాయ మంగళమ్॥

అమల వేంకటశైల శృంగాగ్ర సుభగ భూషణ పదాబ్జునకు భక్తపోషణునకు మంగళాయతనునకు శుభాంగునకును మహిత వేంకటేశ్వరునకు మంగళంబు.

సర్వావయవ సౌందర్య సంపదా సర్వచేతసామ్
సదా సమ్మోహనాయాస్తు వేంకటేశాయ మంగళమ్॥

సతము సర్వాంగ సౌందర్య సంపదల సమస్త చేతనములను మోహాబ్ధిముంచు వృషభశైల వాసికి, శ్రితాభీష్టదునకు మహిత వేంకటేశ్వరునకు మంగళంబు.

నిత్యాయ నిరవద్యాయ సత్యానంద చిదాత్మనే
సర్వాంతరాత్మనే శ్రీమద్వేంకటేశాయ మంగళమ్॥

హృద్యునకు నిత్యునకు నిరవద్యకీర్తి కమల సచ్చిదానంద శుద్ధాత్మునకును, సకల భూతాంతరాత్మకు సంశ్రయునకు మహిత వేంకటేశ్వరునకు మంగళంబు.

స్వతస్సర్వవిదే సర్వశక్తయే సర్వశేషిణే
సులభాయ సుశీలాయ వేంకటేశాయ మంగళమ్॥

సర్వ శక్తియుక్తునకును సర్వశేషి కఖిలముఁ దనంత నెఱుఁగు జనార్ధనునకు
సర్వ సులభున కమల సచ్చరితునకును మహిత వేంకటేశ్వరునకు మంగళంబు.

పరస్మై బ్రహ్మణే పూర్ణ కామాయ పరమాత్మనే
ప్రయుంజే పరతత్త్వాయ వేంకటేశాయ మంగళమ్॥

పరునకుఁ బరాత్మునకుఁ బరబ్రహ్మమునకు జ్ఞాన గమ్యమునకును, బూర్ణ కామునకును
దనుపఁగూర్చువానికిఁ బరతత్త్వమునకు మహిత వేంకటేశ్వరునకు మంగళంబు.

ఆకాలతత్త్వమశ్రాంతమాత్మనామనుపశ్యతామ్
అతృప్త్యమృతరూపాయ వేంకటేశాయ మంగళమ్॥

సగుణ సుందరాకృతి ననిశంబుఁ గాల పారమరయక దర్శించు ప్రాణితతికిఁ
దనివిఁ గననీని యమృతరూపునకు హరికి మహిత వేంకటేశ్వరునకు మంగళంబు.

ప్రాయస్స్వచరణౌ పుంసాం శరణ్యత్వేన పాణినా
కృపయాదిశతే శ్రీమద్వేంకటేశాయ మంగళమ్॥

పరమ కరుణార్ద్రహృదయుఁడై భవ మహాబ్ధి సంతరణ కాంక్షఁ దనుఁజేరు జనుల కివియె
శరణమని చరణముల హస్తమునఁ జూపు మహిత వేంకటేశ్వరునకు మంగళంబు.

దయాఽమృత తరంగిణ్యాస్తరంగైరివ శీతలైః
అపాంగైస్సించతే విశ్వం వేంకటేశాయ మంగళమ్॥

పరమ కరుణా రసామృత వాహినీ తరంగ నిభ శీతలములౌ నపాంగ వీక్షణముల
సమగతి సకల విశ్వమును దడుపు మహిత వేంకటేశ్వరునకు మంగళంబు.

స్రగ్భూషాంబర హేతీనాం సుషమాఽవహమూర్తయే
సర్వార్తి శమనాయాస్తు వేంకటేశాయ మంగళమ్॥

శంఖచక్ర భూషాంబర స్రజములకుఁ బ్రకాశమునుగూర్చు శోభనాకారునకును
ప్రణత భక్తజనార్తి నివారకునకు మహిత వేంకటేశ్వరునకు మంగళంబు.

శ్రీవైకుంఠ విరక్తాయ స్వామిపుష్కరణీతటే
రమయా రమమాణాయ వేంకటేశాయ మంగళమ్॥

ప్రథిత వైకుంఠమందు విరక్తిగలిగి స్వామి పుష్కరిణీ తీర భూమియందుఁ
బ్రీతి లక్ష్మీ సమేతుఁడై క్రీడసలుపు మహిత వేంకటేశ్వరునకు మంగళంబు.

శ్రీమత్సుందరజామాతృ మునిమానసవాసినే
సర్వలోక నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్॥

శ్రీమనోహర రూప విశేషునకును పరమ మనవాళముని హృదావాసునకును
భాసురాఖిలలోక నివాసునకును మహిత శ్రీనివాసునకు శ్రీమంగళంబు.

మంగళాశాసన పరైర్మదాచార్య పురోగమైః
సర్వైశ్చపూర్వైరాచార్యైస్సత్కృతాయాస్తుమంగళమ్॥

మంగళా శాసన పరాంత రంగులైన అస్మ దాచార్యులాదిగ నఖిల పూర్వ
హిత మతాచార్యవరుల సత్కృతులఁ గనిన మహిత వేంకటేశ్వరునకు మంగళంబు.

శ్రీ వేంకటేశ్వర మంగళాశాసనం సమాప్తమ్.

శ్రీ వేంకటేశ్వరార్పణమస్తు!

## వినతి – సమర్పణము

పరమ గురుఁడవు నాశ్రయపదుఁడ వార్త
భక్తపారిజాతమవు కృపాపయోధి
వీవ; నీవు పల్కించిన కృతిని, బత్తి
కానుకను,- వీనిఁ గొనఁగదె! శ్రీనివాస!

తండ్రి! లోకనాటక సూత్రధారి వీవ;
ఎప్పుడేమి కావింతువో యెవని కెఱుక?
కర్త వీవ-క్రియయునీవ-కర్మ వీవ
సకల మీవ-శ్రీ వేంకటశ సాయిదేవ!

శ్రీవిలంబి భీష్మైకాదశీ సురేడ్య-
వారమున భక్తిమై గీత వణితి సుప్ర
భాత వినతులు-స్తుతియు-ప్రపత్తియును-ని
వాళులను దెనుఁగించి యప్పన మొసంగె
స్వామి వేంకటేశునకు బాపట్ల హనుమ.

సర్వమ్ శ్రీ వేంకటేశ్వరార్పణమస్తు!
లోకాస్సమస్తా స్సుఖినో భవంతు!
ఓమ్ తత్ సత్

అజ్ఞానాంతర్గహన పతితా నాత్మవిద్యోపదేశై
స్త్రాతుంలోకాన్భవదవశిఖా తాపపాపచ్య మానాన్
ముక్త్వామౌనం వటవిటపినో మూలతో నిష్పతంతీ
శంభోర్మూర్తిశ్చరతి భువనే శంకరాచార్యరూపా.



ఓమ్ - శ్రుతి స్మృతి పురాణానామాలయం కరుణాలయమ్
నమామి భగవత్పాదం శంకరం లోకశంకరమ్.

# శ్రీ కనకధారాస్తవము



లక్ష్మీం క్షీర సముద్రరాజతనయాం శ్రీరంగధామేశ్వరీం
దాసీభూత సమస్త దేవవనితాం లోకైక దీపాంకురామ్
శ్రీమన్మందకటాక్షలబ్ధ విభవబ్రహ్మేంద్ర గంగాధరాం
త్వాం త్రైలోక్య కుటుంబినీం సరసిజాం వందే ముకుందప్రియామ్॥

శ్రీయైనమః [పీఠిక]

# శ్రీ కనకధారా స్తోత్రము

సర్వలోక పూజ్యుఁడు భగవానుఁడగు శ్రీ శంకరాచార్య వటువు గురుకుల వాసము సేయు సమయమున భిక్షను గైకొనఁగోరి తన సహపాఠులతో నొక దరిద్ర బ్రాహ్మణుని గృహమును బ్రవేశించెను. తన గృహమునకు భిక్షాచర్యకై యరుదెంచిన నిరుపమ బ్రహ్మవర్చస్సుతో నొప్పుచున్న యా బ్రహ్మచారినిఁ గాంచి యా విప్రుని ధర్మపత్ని "మీవంటి మహాత్ముల పరిచర్యఁ గావించు వారలు పుణ్యాత్ములు, ధన్యులు. పుణ్యాత్ములకే మహానుభావుల సందర్శనము, సంసేవలచే వారిని సంతృప్తిపఱచుట మొదలగు భాగ్యములు లభించును. అట్టివారి పుట్టువులు సార్థకములు. మాకట్టివి లభ్యములా?" అని మహా దీనముగ మిక్కిలి యాదరముతోఁ బలికెను.

అట్లు వినయమునఁ దన దీనదశ నుగ్గడించుచు నాగృహిణి బ్రహ్మచర్యవ్రత ధరుఁడగు బాల శంకరునకు నుసిరికపండు నొకదానినిఁ బరమాదరముతో జోలెలో వైచెను. ఆమె యొసంగిన్న యా మలక ఫలమును మహాప్రీతితోఁ గైకొనుచు నా వటువరుండా పేద యిల్లాలి పరివేదనాత్మకములై కరుణను గలిగించు దీనోక్తుల నాలకించి దయార్ద్రచిత్తుఁడై నవనీత కోమల హృదయుఁడగుటచే నాతల్లి దీనస్థితి సహింపలేక యనుగ్రహింపఁ దలఁచెను.

ఆ పేదయిల్లాలి దారిద్ర్యదశను బాపఁగోరి బాలశంకరుఁడిందుఁ దెలుపఁ బడిన మధురములు నవనీత కోమలములు పదచిత్రముల గు స్తవములచే శ్రీ జగన్నాథ గృహిణిని స్తుతించెను. ఆ స్తోత్రములకు సంతుష్టి నొంది యిందిరాదేవి మెరుపు తీఁగను నిరసించు మేనికాంతిచే సకల దిశలను బ్రకాశింపఁజేయుచు నా వటువు ముంగల బ్రత్యక్షమయ్యెను. బ్రహ్మేంద్రాది దివిజవందితములగు నా లోకమాత పాదాంబుజములకుఁ బ్రణమిల్లి బాలశంకరుఁడు కావించిన లలిత స్తుతులకు సంతసించి శ్రీదేవి చిఱునవ్వులు చిందులాడు మోముతో "వత్సా! నీ తలంపు నే నెఱుఁగుదును. బహుపుణ్యము లాచరింపకుండినను పుణ్యలేశమేనిఁ గావింపఁ జాలినవారు నా యనుగ్రహ పాత్రులగుదురు" అని పలికెను. అంతనావటు వంజలి ఘటించి "తల్లీ! నేను నీ యనుగ్రహమునకుఁ బాత్రుఁడనగుదునేని, నన్ను గరుణింపఁ దలఁచితేని యీ బ్రాహ్మణ గృహిణి పరమాదరముతో నా మలక ఫలము నొకదానిని నాకు సమర్పించెను. కావున నా యుసిరిక పండు నొసంగిన ఫలమిప్పుడే జాగుసేయక

మొసంగుము" అని పటువైన శంకరుఁడు లక్ష్మీదేవినిఁ బ్రార్థించెను. ఆ పలుకులకు మిక్కిలి సంతసించి కమలాదేవి యా విప్రుని గృహమునందంతటను కనకామలకముల వర్షించెను. జనులెల్ల రాశ్చర్యచకితులై శ్రీ శంకరుల మహాద్భుత మహిమలను గొనియాడుచు నతఁడు సాక్షాచ్ఛంకరుఁడని ప్రస్తుతించిరి.

మహామహిమా సంపన్నుఁడు పవిత్రుడు దానపాత్రుఁడగు వానికిడినదానమే లవమైనను తత్క్షణమే యనంతఫలము ప్రసాదించుననియు, పురాకృత సుకృత లేశము లేకున్నను మహాత్ముల యనుగ్రహ మమోఘమనియు, మనము గ్రహింపఁ దగును. శ్రీ శంకర భగవత్పాదకృతమగు నీ కనక ధారా స్తవమును నిత్యము పఠించి సోదర భక్తులందరు నైహికాముష్మిక సుఖభోగము లనుభవింతురుగాత!

—0—

శ్రీయైనమః

# శ్రీ కనకధారా స్తోత్రము

వందే వందారు మందార
మింది రా నంద కందళమ్
అమం దానంద సందోహ
బంధురం సింధురాననమ్॥

శ్రీ రమానంద కందళు, శ్రితహితార్థ దాన మందారు, నానందధాము, విబుధ సేవితపదాబ్జుఁ బార్వతీ శివ తనూజు, విఘ్నపతి సింధు రాస్యు సేవింతు సతము!

అంగం హరేః పులక భూషణ మాశ్రయంతీ
భృంగాంగ నేవ ముకుళాభరణం తమాలం
అంగీకృతాఖిల విభూతి రపాంగలీలా
మాంగల్యదాస్తు మమ మంగళ దేవతాయాః

చిగిరిచిన కానుగను గుమిఁజేరు పెంటి తుమ్మెదలువోలె గరుపాటు తోయజాక్షు మేనఁ బ్రసరించు విభవలక్ష్మి కటాక్ష వీక్షణలు నాకు శుభముల నిచ్చుఁగాత!

ముగ్ధా ముహు ర్విదధతీ వదనే మురారేః
ప్రేమత్రపా ప్రణిహితాని గతాగతాని
మాలదృశో ర్మధుకరీవ మహోత్పలేయా
సామే శ్రియం దిశతు సాగర సంభవాయాః

నల్లకలువపై వ్రాలి యంతటన మగుడు పెంటి తుమ్మెదకైవడిఁ బెరమసిగ్గు లతుక, హరిమోము నెడ గతాగతములైన లచ్చి చూపుల చాలు నాకిచ్చు సిరులు.

విశ్వామరేంద్ర పదవిభ్రమ దానదక్ష
మానంద హేతురధికం మురవిద్విషోఽపి
ఈషన్నిషీదతు మయిక్షణ మీక్షణార్థ
మిందీవ రోదర సహోదర మిందిరాయాః!

ఇంద్ర పదవిభూతి ననుగ్రహింపఁ జాలి హరికి నమిత మోదావహ మగుచు, నల్ల
కలువ తేజొప్పు లచ్చి క్రీఁగంటిం చూపొకింత తడవు నాయందు వర్తించుఁగాత.

ఆమీలి తాక్ష మధిగమ్య ముదాముకుంద
మానంద కంద మనిమేష మనంగతంత్రమ్
ఆకేకరస్థిత కనీనిక పద్మ నేత్రం
భూత్యై భవేన్మమ భుజంగ శయాంగనాయాః!

తన్ను లరమోడ్పు నానంద ఘను ముకుందుఁ గామ పరవశయై చేరి, ప్రేమగదుర
సగము మొగిచి తెప్పలను వ్రాల్చుకయ చూచు లచ్చి చూపులు సిరుల నాకిచ్చుఁగాత.

కాలాంబు దాళిలలితో రసి కైటభారే
ర్ధారాధరే స్ఫురతి యా తటిదంగనేవ,
మాతుస్సమస్త జగతాం మహనీయమూర్తి
ర్భద్రాణిమే దిశతు భార్గవ నందనాయాః!

శ్యామసుందర హరివత్స జలధరమున మెఱపుఁదీఁగ చందంబున వఱలు సకల
జగములకుఁ దల్లి, యిందిరా సౌమ్యరూప మెల్ల శుభముల నాకు వర్ధిల్లఁ జేయు.

బాహ్యాంతరే మధుజిత శ్రితకౌస్తుభేయా
హారావళీవ హరినీల మయీవిభాతి
కామప్రదా భగవతోఽపి కటాక్షమాల
కల్యాణ మావహతుమే కమలాల యా యాః!

కౌస్తుభముతోడ విష్ణు వక్షంబునందు నింద్ర నీల హారావళి యొఁపుఁగూర్చి,
హరికిని నభీష్ట మొసఁగు పద్మాలయా కటాక్షమాలలు నాకు భాగ్యములఁగూర్చు.

ప్రాప్తంపదం ప్రథమతః ఖలు యత్ప్రభావాత్
మాంగల్యభాజి మధుమాథిని మన్మథేన
మయ్యాపతేత్తదిహ మంథర మీక్షణార్థం
మందాలసంచ మకరాలయ కన్యకాయాః!

అది నేదేవి కరుణాకటాక్ష మహిమ కామపశ సర్వలోక రక్షక పదంబుఁ
బడసెను మురారి, యట్టి యబ్జాలయా కటాక్షమాల నాపైఁ దనరారుఁ గాత

దద్యాద్దయాను పవనో ద్రవిణాంబుధారా
మస్మిన్న కించన విహంగ శిశౌవిషణ్ణే
దుష్కర్మఘర్మ మపనీయ చిరాయ దూరం
నారాయణప్రణయనీ నయనాంబు వాహః!

అతిదయానిల చలిత భాగ్యాంబుధార లీపురాకృతపాప సంతాపతప్త
మైన చాతక పోతంబు పైనఁగురియుఁగాత! లక్ష్మి విలోకన కంధరంబు.

ఇష్టా విశిష్ట మతయోపి యయాదయార్ద్ర
దృష్ట్యా త్రివిష్టప పదం సులభం లభంతే,
దృష్టిః ప్రహృష్ట కమలోదర దీప్త రిష్టాం
పుష్టిం కృషీష్ట మమ పుష్కర విష్ట రాయాః!

యాగములు సేయఁబోని వారైన నలతి నేదయార్ద్ర వీక్షణఁగందు రింద్రపదవి,
నట్టి వికచాబ్జరుచిర పద్మానుకూల దృష్టినాకీయుఁగాత! మభీష్టసిద్ధి.

గీర్దేవ తేతి గరుడధ్వజ సుందరీతి
శాకంభరీతి శశిశేఖర వల్లభేతి
సృష్టిస్థితి ప్రళయ కేళిషు సంస్థితాయా
తస్యై నమస్త్రిభువనైక గురోస్తరుణ్యై!

సృష్టివాణినా, స్థితి హరిప్రియ యనఁగఁ గాలదేవతా రూప శాకంభరి యనఁ
బ్రళయ కేళినిఁ గాళినాఁ బఱఁగు త్రిభువనైకగురుని ప్రేయసికి జోహారులిడదు.

శ్రుత్యై నమోఽస్తు! శుభకర్మ ఫల ప్రసూత్యై
రత్యై నమోఽస్తు! రమణీయ గుణార్ణవాయై
శక్త్యై నమోఽస్తు! శతపత్ర నికేతనాయై
పుష్ట్యై నమోఽస్తు! పురుషోత్తమ వల్లభాయై!

సుకృతి ఫలదాయి - శ్రుతిరూపిణికి నమస్సు వివిధ సుగుణాబ్ధి - హ్లాదిరూపిణికి వినతి
వనజవాసిని - శక్తిరూపిణికి నతులు విష్ణువల్లభ - పుష్టిరూపిణికిఁ బ్రణతి.

నమోఽస్తు! నాళీక నిభాననాయై
నమోఽస్తు! దుగ్ధోదధి జన్మభూమ్యై
నమోఽస్తు! సోమామృత సోదరాయై
నమోఽస్తు! నారాయణ వల్లభాయై!

పద్మ సంకాశవదనకు వందనంబు, పాల వెల్లిపట్టికి నమోవాకశతము,
శశిసుధా సహోదరికి సాష్టాంగ వినతి, వినుత నారాయణ ప్రణయినికిఁ బ్రణతి.

నమోఽస్తు! హేమాంబుజ పీఠికాయై
నమోఽస్తు! భూమండల నాయికాయై
నమోఽస్తు! దేవాదిదయా పరాయై
నమోఽస్తు! శార్ఙ్గాయుధ వల్లభాయై!

స్వర్ణ వారిజాసనకు నంజలి ఘటింతు నఖిల భువన నాయికకు జోహారులిడుదు
భూతకరుణానిరతకుఁ జేమోడ్పులిత్తు శ్రీహరి ప్రేయసికి నమస్కృతుల నిడుదు.

నమోఽస్తు! దేవ్యై భృగునందనాయై
నమోఽస్తు! విష్ణోరురసి స్థితాయై
నమోఽస్తు! లక్ష్మ్యై కమలాలయాయై
నమోఽస్తు! దామోదర వల్లభాయై!

భృగుతనూభవ దేవికి వినతులిడుదుఁ, శ్రీవత్సవాసినికి నంజలి ఘటింతుఁ
గమలగేహిని - లక్ష్మికిఁ గరము మోడ్తు నబ్జనాభ నాయికకు జోహారులిడుదు.

నమోఽస్తు! కాంత్యై కమలేక్షణాయై
నమోఽస్తు! భూత్యై భువన ప్రసూత్యై
నమోఽస్తు! దేవాదిభిరర్చితాయై
నమోఽస్తు! నందాత్మజ వల్లభాయై!

వనజనేత్ర - తేజస్స్వరూపిణికి నతులు, విశ్వజనని - సంపత్స్వరూపిణికి ప్రణతి
సకల దేవాది నుతపదాబ్జకు నమస్సు, నందనందనప్రియకు వే వందనములు.

సంపత్కరాణి సకలేంద్రియ నందనాని
సామ్రాజ్యదాన విభవాని సరోరుహాక్షి!
త్వద్వందనాని దురితా హరణోద్యతాని
మామేవ మాతరనిశం కలయంతు మాన్యే!

పాప పరిహారకములు, సంపత్కరములు, భవ్యములు, నింద్రియానంద వర్ధకములు.
తల్లి! మాన్య! కమలనేత్ర! త్వత్పదాభి వందనములు నఽసతముఁ గాపాడుగాత.

యత్కటాక్షసము పాసనావిధి
స్సేవకస్య సకలార్థ సంపద
స్సంతనోతి వచనాంగ మానసై
స్త్వాంమురారి హృదయేశ్వరీం భజే!

జనని! యెవరి కటాక్ష వీక్షణమొకింత సోకుమాత్ర సేవకునకస్తోక సంప
దలఁ బ్రసాదింపఁజాలు, నా జలజనాభు ప్రియను నిన్ను భజించెదఁ ద్రికరణముల.

సరసిజనయనే సరోజహస్తే
ధవళతమాంశుక గంధమాల్య శోభే
భగవతిహరివల్లభే మనోజ్ఞే
త్రిభువన భూతికరి ప్రసీద మహ్యమ్!

కమల దళనేత్రి! కంజసం కలితహస్త! స్వచ్ఛవసన చందన సుమశ్రీగ్విభూష! విశ్వసంపత్ప్రదాయిని! వెన్నురాణి! భగవతీ! నన్ననుగ్రహింపఁగదె! తల్లి.

దిగ్ఘస్తిభిః కనక కుంభముఖావ సృష్ట
స్వర్వాహినీ విమలచారు జలప్లుతాంగీమ్
ప్రాతర్నమామి జగతాం జననీ మశేష
లోకాధి నాథగృహిణీ మమృతాబ్ధి పుత్రీమ్!

హేమ ఘటముల డిగ్గంతు లెత్తిపోయు స్వర్నదీ నీరములఁదోఁగు సకలలోక జనని! లోకాధినాథగేహిని! సుధాబ్ధి పుత్రి! లక్ష్మి! నిన్ను ప్రభాతమున భజింతు.

కమలే కమలాక్ష వల్లభేత్వం
కరుణాపూర తరంగితైరపాంగైః
అవలోకయ మా మకించనానాం
ప్రథమం పాత్ర మకృత్రిమం దయాయాః

కమలలోచన ప్రణయినీ! కమల! దీన తముఁడు, నీ దయకుఁదగు పాత్రమగు వీని నిఁకఁగరుణా రసంబు వర్షించు నీ కటాక్షవీక్షణన్ ధన్యుఁజేయఁగదె! తల్లి.

బిల్వాటవీ మధ్యల సత్సరోజే
సహస్ర పత్రే సుఖ సన్నివిష్టామ్,
అష్టాపదాం భోరుహః పాణిపద్మాం
సువర్ణ వర్ణాం ప్రణమామి లక్ష్మీమ్!

* బిల్వ వనమధ్యమందున వేయిరేకు లమరు జలజ మందాసీన యగుచుఁగనక కమలముల నిజపాణిపద్మములఁదాల్చు స్వర్ణ వర్ణను లక్ష్మిని సంస్తుతింతు.

కమలాసన పాణినాలలాటే
లిఖితా మక్షర పంక్తి మస్యజంతోః
పరిమార్జయ మాతరంఘ్రిణాతే
ధనికద్వార నివాస దుఃఖ దోగ్ధ్రీమ్!

"భాగ్యవంతుల గృహబహిర్ద్వారములను జేరి, వనరుమీ," _ అనుచు, నీజీవి నొసట ధాత తన చేత వ్రాసిన వ్రాత, నీపదాబ్జమున మార్జనము సేయు మమ్మ! లక్ష్మి!

* ౨౨, ౨౩, ౨౪, అధిక పాఠములు.

అంభోరుహం జన్మగృహం భవత్యా
వక్షస్థలం భర్తృగృహం మురారేః
కారుణ్యతః కల్పయ పద్మవాసే!
లీలాగృహం మే హృదయారవిందమ్!

జనని! యంభోరుహంబు నీ జన్మగృహము, పద్మనాభు వక్షంబు నీ భర్తృగృహము,
లలితకృప నింక నీదు లీలాగృహంబు, సలుపుకొనవె! నా హృదయాంబుజంబు, లక్ష్మి.

స్తువంతి యేస్తుతిభి రమీభి రన్వహం
త్రయీమయీం త్రిభువన మాతరం రమామ్,
గుణాధికా గురుతర భాగ్యభాజినో
భవంతి తేభువి బుధ భావితాశయా!

నిగమమయ లోకమాతయై నెగడులక్ష్మి నీ స్తుతులఁ బ్రత్యహంబుఁ గీర్తించువారు
గుణవిశిష్టులు భాగ్యభాజనులు నగుచు, బుధజన స్తవనీయులై పొడలుచుంద్రు.

సువర్ణ ధారా స్తోత్రంయత్
చ్ఛంకరాచార్య నిర్మితమ్,
త్రి సంధ్యంయః పఠేన్నిత్యం,
సకుబేర నమోభవేత్.

ఆదిశంకర భగవత్పదాచార్యవర్య రచితమైన యీ కనక ధారా స్తవంబు
మూఁడువేళలఁ బఠియించువాఁడు ధనద తుల్యుఁడై శాంతి తృప్తి సంతుష్టులొందు.

శ్రీ జగద్గురు శంకరాచార్య విరచిత
శ్రీ కనకధారా స్తోత్రము సంపూర్ణము.



# శ్రీ నారాయణ షట్పదీ స్తోత్రము - పీఠిక

శ్రీ శంకరుఁడు వృద్ధురాలగు జనని ఆర్యాంబ స్నానాది కార్యములు నిర్వర్తించుకొనుటకై దూరమునఁ బ్రవహించు పూర్ణానదికి వెళ్ళఁజాలదని తలంచి, యా నదీమతల్లినిఁ బ్రార్థించి తన గృహమునకు సమీపముగఁ బ్రవహించునట్లు చేసెను. ఆ నదీ తరంగములచే సమీపమునఁ గల శ్రీ కృష్ణాలయము పూర్తిగఁ గదలి శిథిలమై పడిపోవునట్లుండెను. శ్రీకృష్ణ విగ్రహము స్వస్థానమునుండి చలించెను. తిరిగి శ్రీకృష్ణ విగ్రహమును, దేవాలయమును సుస్థిరముగ బ్రతిష్ఠింపఁ గలవారు లేకుండిరి.

ఆ సమయమున శ్రీకృష్ణ భగవానుఁడే శ్రీ శంకరు ననుగ్రహింపఁదలఁచెను. లోకోద్ధరణమునకై యత్యాశ్రమము స్వీకరింప బహుదూరమునకుఁ బోఁదలంచిన శంకరుఁడు తన జనని పాద పద్మములకుఁ బలుమాఱులు సాఁగిలఁ బడి మ్రొక్కి, యనుజ్ఞను గోరుచున్న యతని నుద్దేశించి దివ్యవాణి యిట్లు పలికెను. "నీ మాతృ హితముఁ గోరి సామీప్య గామినిఁ గావించిన పూర్ణానదివలన నా నిలయము శిథిలముగా నున్నది. దీనికిఁ గారణభూతుఁడవగు నీవే యీ కోవెలను సముద్ధరింపుము". శ్రీకృష్ణ భగవానుని యశరీరవాణిని వినిన శంకరుడు "అవినయ మపనయ విష్ణో"... అని శ్రీ నారాయణ షట్పదీ స్తోత్రమును వచించి తన భుజములచే తానే యంగభంగ మేమియుఁ గలుగనీయక శ్రీకృష్ణ విగ్రహమును మెల్లగాఁ గొనిపోయి సమీప ప్రదేశమున యథావిధిగఁ బ్రతిష్ఠించెను.

ఇట్లు మాతృదేవి యనుగ్రహమును శ్రీ కృష్ణానుగ్రహమును బడసి, సకల ప్రాణికోటి హృదయ క్షేత్రములందు కేవలానంద స్వరూపుఁడై ప్రకాశించు శ్రీకృష్ణ భగవానునియందు మనస్సు నిలిపి లోకోద్ధరణకై శ్రీ శంకర భగవత్పాదులు గృహమునుండి వెడలెను. శ్రీ శంకరాచార్య వాగమృతము వెదజల్లు శ్రీ నారాయణ షట్పదీ స్తోత్రమును సోదర భక్తులు నిత్యముఁ బఠించి యిహపర సుఖానందములఁ బడయుదురుగాత!

ఓమ్

నమో భగవతే వాసు దేవాయ

# శ్రీ నారాయణ షట్పదీ స్తోత్రము

అవినయ మపనయ విష్ణో
దమయ మన శ్శమయ విషయమృగతృష్ణామ్,
భూత దయాం విస్తారయ
తారయ సంసార సాగరతః!

కృష్ణ! నా యవినయము సైరింపఁ గదవె! విషయ మృగతృష్ణకై పరువెత్తు మనసు మెలపఁగదె! భూతకరుణా సమృద్ధి నిడవె! సంసరణవార్ధి తరణమై సాయపడవె.

దివ్య ధునీ మకరందే
పరిమళ పరిభోగ సచ్చిదానందే
శ్రీపతి పదారవిందే
భవ భయ ఖేవచ్ఛిదే వందే!

పూత సురనదీ మకరంద పూరితంబు, సచ్చిదానంద భోగ విస్ఫారితంబు, భూరిభవదుఃఖ భీతినివారకంబు, మ్రొక్కెద జనార్దన పదాంబుజ యుగంబు.

సత్యపి భేదాఽపగమే
నాథ తవాఽహం, న మామకీనస్త్వమ్
సాముద్రోహి తరంగః
క్వచన సముద్రోన తారంగః!

స్వామి! మనకుభేదంబు విస్పష్టమైన, నేను నీవాఁడ; నావాఁడ నీవుకావు; తరంగ-జలనిధిమూలమై తనరుఁగాని, జలనిధి-తరంగమూలమై చనునే? కృష్ణ.

ఉద్ధృతనగ నగభిదనుజ
దనుజకులాఽమిత్ర మిత్ర శశి దృష్టే
దృష్టే భవతి ప్రభవతి
నభవతికిం? భవ తిరస్కారః!

ధన్యగిరివరధర! ధరాధరభిదనుజ! దనుజకులహిమమిత్ర! మిత్రశశినేత్ర! నేత్రములనినుగనఁ -గనునే? త్రియాను తాతిశయఃభవ! - భవమహాభీతి సరుఁడు.

మత్స్యాదిభి రవతారై
రవతారవతాఽవతాసదావసుధామ్
పరమేశ్వర పరిపాల్యో
భవతా భవతాప భీతోఽహమ్!

సారసాక్ష! మీనాద్యవతారముల ధరించి, భూభార మడంచి రక్షించినావు;
కరుణఁబరిపాలనము సేయఁగదవె! భవభయవ్యథాతప భీతుఁడనైన నన్ను.

దామోదర గుణమందిర
సుందర వదనారవింద గోవింద
భవజలధి మథన మంథర
పరమం దర మపనయ త్వంమే!

సుందర ముఖారవింద! గోవింద! సుగుణ మందిరా! యిందిరేశ! యానంద కంద!
ఘోర సంసార జలనిధిఁగూలి, యటమటించు భీతు నన్ను సముద్ధరించఁగదవె!

నారాయణ కరుణామయ
శరణం కరవాణి తావకౌ చరణౌ
ఇతి షట్పదీ మదీయే
వదన సరోజే సదావసతు!

కరుణామయ! నారాయణ! శరణము సేసెదను నీదుచరణంబుల; నీ
సురుచిర షట్పది నాముఖ సరసీజమునందు విడక సతము వసించున్.

శ్రీ జగద్గురు శ్రీ మచ్ఛంకరాచార్య విరచిత శ్రీ నారాయణ షట్పదీ స్తోత్రమ్
సంపూర్ణమ్

ఆది శంకర భగవత్పాదార్యవర్య
రచితమైన శ్రీ కనక ధారాస్తవంబు
షట్పదీస్తవంబును దెల్గుసరణిఁబలికి
శ్రీహరి పదాంబుజముల కర్పించె హనుమ!

—0—

# శ్రీ లక్ష్మీనృసింహ స్తోత్రము – పీఠిక

శ్రీ శంకర భగవత్పాదులు మండన మిశ్రుని శాస్త్రవాదమున జయింప నతనిభార్య ఉభయభారతి శంకరాచార్యునితో శాస్త్ర వాదమునకుపక్రమించి కావించిన కామశాస్త్ర విషయక ప్రశ్నమునకు సమాధానముఁ దెలుపనేరక మాసము దినములు శంకరుఁడు వ్యవధి కోరెను. జగద్గురువు తన దివ్యదృష్టిచే అమరక మహారాజు మృతినొందిన విషయ మెఱింగి తన కాయమును భద్రముగఁ గాపాడుమని శిష్యుల నియమించి, పరకాయ ప్రవేశ విద్యా కౌశలమున నా రాజు శరీరమునఁ బ్రవేశించెను.

పునర్జీవితుఁడైన రాజు ప్రతిభా విశేషమునకు రాణియు మంత్రులాశ్చర్య పడి యాలోచించి తమ రాజ్యములోని మృత దేహముల దహింపుఁడని భటుల నాజ్ఞాపించిరి. పద్మపాదాది శిష్యులు సంగీత విద్వాంసుల వేషముల ధరించి రాజ మందిరముఁ బ్రవేశించి గాన వ్యాజమున రాజ దేహాంతర్గతుఁడగు తమ గురువునకు స్వస్వరూప ప్రబోధముఁ గావించిరి. అప్పటికే రాజభటులు శంకర దేహమును చితిపైఁ బెట్టి నిప్పంటించిరి. రాజతనువును విడచి స్వశరీరమును జేరిన శంకరుఁడు అగ్నియుపశమించి తనకాయ మెప్పటివలె సర్వాంగ సౌష్ఠవముగ నొప్పుటకై శ్రీ నరసింహ రూపధారియగు శ్రీ విష్ణువును "లక్ష్మీ నృసింహ మమదేహి కరావలంబమ్" అను మకుటమున స్తుతించి భగవత్కరుణచే దేహ సౌష్ఠవమును బడసెను. శ్రీ లక్ష్మీనృసింహ కరావలంబన స్తోత్రమును నిత్యముఁ బఠించి సోదర భక్తులు సకలాభీష్టసిద్ధిఁ బడయుదురుగాత!

—0—

ఓమ్

నమః శ్రీ లక్ష్మీ నృసింహాయ

## శ్రీ లక్ష్మీనృసింహ స్తోత్రము

శ్రీ మత్పయోనిధి నికేతన చక్రపాణే
భోగీంద్ర భోగమణిరాజిత పుణ్యమూర్తే,
యోగీశ శాశ్వత శరణ్య భవాబ్ధిపోత
లక్ష్మీ నృసింహ మమదేహి కరావలంబమ్.

శ్రీ పయోధివాస శరణ్య! శేషభోగి భోగమణిరంజిత శుభాంగ యోగినాథ! శాశ్వత! భవాబ్ధితారక! చక్రహస్త! చేరి, చేయూఁత నిడవె! లక్ష్మీ నృసింహ!

బ్రహ్మేంద్ర రుద్రమరు దర్క కిరీటకోటి
సంఘట్టి తాంఘ్రికమలామల కాంతి కాంత;
లక్ష్మీలసత్కుచ సరోరుహ రాజహంస
లక్ష్మీ నృసింహ మమదేహి కరావలంబమ్!

ఆజబిడౌజరుద్రార్కానిలాది దివిజ మకుటమణికాంతి రాజితామల పదాబ్జ!
రాజ్యలక్ష్మీకుచాంభోజ రాజహంస! చేరి, చేయూఁతనిడవె! లక్ష్మీ నృసింహ

సంసార సాగర విశాల కరాళకామ
నక్రగ్రహగ్రసన నిగ్రహవిగ్రహస్య,
మగ్నస్య రాగలస దూర్మినిపీడితస్య
లక్ష్మీ నృసింహ మమదేహి కరావలంబమ్!

సంసరణవార్ధిఁ గామమన్ జటులనక్రముఖమునన్ జిక్కుపడి, మేనుపొలియ మునుఁగ
చుంటి రాగవీచికలు నుఱ్ఱూతలూఁపఁ జేరి, చేయూతనిడవె! లక్ష్మీనృసింహ.

సంసార ఘోరగహనే చరతో మురారే
మారోగ్ర భీకర మృగప్రవరార్ది తస్య
ఆర్తస్య మత్సర నిదాఘ నిపీడ తస్య
లక్ష్మీ నృసింహ మమదేహి కరావలంబమ్!

భవమహాటవిన్ దిరుగుచుఁ బ్రసవశరమహోగ్ర మృగము చేఁబలు బాధలొంది, మత్స
రాతప నిపీడితుఁడ,-నార్తుఁడైన వాఁడఁ, జేరి చేయూతనిడవె! లక్ష్మీనృసింహ.

సంసారకూప మతిఘోరమగాధ మూలం
సంప్రాప్య దుఃఖ శతసర్ప సమాకులస్య
దీనస్య దేవ కృపయా శరణాగతస్య
లక్ష్మీ నృసింహ మమదేహి కరావలంబమ్!

ఘోరము నగాధమౌ భవకూపమందుఁ బెక్కు దుఃఖసర్పములు నన్నేచని, కలఁచెఁ;
శరణుఁజొచ్చితి దీనుఁడఁ, గరుణఁబఱపి చేరి, చేయూఁతనిడవె! లక్ష్మీనృసింహ.

సంసార భీకర కరీంద్ర కరాభిఘాత
నిష్పీడ్యమాన వపుష స్సకలార్దితస్య
ప్రాణప్రయాణ భవభీతిసమాకులస్య
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్!

చటుల సంసార హస్తి హస్త ప్రఘాత పాతముల మేను జర్జరీ భూతమయ్యె
ప్రాణములు వాయుననను భీతి పొదుకొనియెఁ జేరి, చేయూఁత నిడవె! లక్ష్మీనృసింహ.

సంసారసర్ప విషదుష్ట మహోగ్రతీవ్ర
దంష్ట్రా కరాళ విషదగ్ధ వినష్టమూర్తే
నాగారి వాహన సుధాబ్ధినివాస శౌరే
లక్ష్మీ నృసింహ మమదేహి కరావలంబమ్!

భవ భుజంగము విషదుష్ట భయ మహోగ్ర తీవ్ర దంష్ట్రలంజీల్చంగ దేహ మవిసె; శౌరి! క్షీరాబ్ధివాస! నాగారివాహ! చేరి, చేయూంత నిడవె! లక్ష్మీనృసింహ.

సంసారజాల పతితస్య జగన్నివాస
సర్వేంద్రియార్థ బడిశస్థ ఝషాత్మనశ్చ
ప్రోత్తంభిత ప్రచురతాలుక మస్తకస్య
లక్ష్మీ నృసింహ మమదేహి కరావలంబమ్!

సంసరణ జాలమందు విషయములనెడి గాలమున మీనమటుంజిక్కి; తాలుకములం దలయుంజూచి పైకెత్తుచు సొలసినాండం జేరి, చేయూంత నిడవె! లక్ష్మీనృసింహ.

సంసారవృక్ష మఘబీజ మనంతకర్మ
శాఖాయుతం కరణపత్ర మనంగపుష్పం
ఆరుహ్య దుఃఖజలధౌ పతితో దయాళో
లక్ష్మీ నృసింహ మమదేహి కరావలంబమ్!

అఘము బీజము_కర్మచయములు శాఖ లింద్రియములాకు లంగజుండే సుమాళి యైన భవభూజ మెక్కి, దుఃఖాబ్ధిఁబడితిం జేరి, చేయూంత నిడవె! లక్ష్మీనృసింహ.

సంసార దావ దహనాకుల భీకరోగ్ర
జ్వాలావళీభి రభితప్త తనూరు హాస్య
త్వత్పాదయుగ్మ సరసీరుహ మస్తకస్య
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్!

సంస్కృతిదవాగ్ని భీకరజ్వాలలెల్లం గ్రమ్ముకొనెం, దనూరుహంబులు గాలుచుండె; శిరము నీ పదాంబుజములం, జేర్చినాండం జేరి, చేయూంత నిడవె! లక్ష్మీనృసింహ.

సంసార సాగర నిమజ్జన ముహ్యమానం
దీనం విలోకయ విభో కరుణానిధేమాం
ప్రహ్లాద ఖేద పరిహార పరావతార
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్!

భవమహాంబుధి మునిగినవాండ, మోహవశుండ, దీనుండం గనవె; కృపాపయోధి! దేవ! ప్రహ్లాదవరద! పరావతార! చేరి, చేయూంతనిడవె! లక్ష్మీనృసింహ!

సంసార యూధగజ సంహతి సింహ దంష్ట్రా
భీతస్య దుష్టమతి దైత్య భయంకరేణ
ప్రాణ ప్రయాణ భవ భీతి నివారణేన
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్!

సంసరణ వారణానేక చటుల దంష్ట్రములకు వెఱతు; దుర్మతి దైత్యకుల వినాశ! ఆశ్రితజనౌఘ మృత్యుభయాపనయన! చేరి, చేయూఁతనిడవె! లక్ష్మీనృసింహ.

సంసార యోగి సకలేప్సిత నిత్యకర్మ
సంప్రాప్యదుఃఖ సకలేంద్రియ మృత్యునాశ
సంకల్ప సింధు తనయా కుచ కుంకు మాంక
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్!

సంసృతిని నిత్యమైనయు వాంఛలను గ్రియలఁ బొడము వ్యసనముల్ మృతిభీతి నడఁచు దేవ! అబ్ధికన్యకా కుచ కుంకు మాంక! రమణ! చేరి, చేయూఁతనిడవె! లక్ష్మీనృసింహ.

బద్ధ్వా గళే యమ భటా బహుభర్త్స్యయంతి
కర్షంతి యత్రపథి పాశశతైర్యదా మాం
ఏకాకినం పరవశం చకితం దయాళో
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్!

పరవశుని భీతు నేకాకి నరసి, పట్టి, యమభటులు పాశములఁగట్టి శ్రమలఁబెట్టి యెట్టిదారి నెప్పట్టున నీడ్తురేమొ! చేరి, చేయూఁతనిడవె! లక్ష్మీనృసింహ.

అంధస్యమే హృతవివేక మహాధనస్య
చోరైర్మహాబలిభి రింద్రియ నామధేయైః
మోహాంధకారకుహరే వినిపాతితస్య
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్!

బలియు రింద్రియ చోరులు కల వివేక ధనము హరియించి రాగాంధ దర్పు నన్ను మోహ కూపంబునను ద్రోసి పోయి రకట! చేరి, చేయూఁత నిడవె! లక్ష్మీనృసింహ.

లక్ష్మీపతే కమలనాభ సురేశ విష్ణో
యజ్ఞేశ యజ్ఞ మధుసూధన విశ్వరూప
బ్రహ్మణ్య కేశవ జనార్ధన వాసుదేవ
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్!

శ్రీశ! మధువైరి! కేశవ! కృష్ణ! యజ్ఞ! విష్ణు! యజ్ఞేశ! బ్రహ్మణ్య! విశ్వరూప! అమరనాథ! జనార్ధన! కమలనాభ! చేరి, చేయూఁత నిడవె! లక్ష్మీనృసింహ.

ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుక శౌనక హృన్నివాస
భక్తానురక్త పరిపాలన పారిజాత
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్!

వ్యాస నారద ప్రహ్లాద వరపరాశ రాంబరీష శౌనక శుక ప్రముఖ హృదయ వాస! భక్తప్రియావన పారిజాత! చేరి, చేయూత నిడవె! లక్ష్మీనృసింహ.

ఏకేన చక్రమపరేన కరేణ శంఖ
మన్యేన సింధు తనయా మవలంబ్య తిష్ఠ
వామేత రేణ వరదాభయ హస్తముద్రాం
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్!

చక్రమొకకేల నొకకేల శంఖ మొక్క చేత వామాంకముననున్న సిరిని, వేఱ యొకటను వరదాభయ ముద్ర నూనుదేవ! చేరి, చేయూత నిడవె! లక్ష్మీనృసింహ.

ఆద్యంత శూన్య మజ మవ్య యమప్రమేయ
మాదిత్య రుద్రనిగమాది నుత ప్రభావం
త్వాంఒఽబోధి జాస్యమధు లోలుప మత్త భృంగం
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్!

అవ్యయా! యప్రమేయ! యాద్యంత రహిత! బ్రహ్మరుద్రార్క నిగమాది ప్రస్తుత ప్రభావ! కమలాలయాముఖ పద్మ భృంగ చేరి, చేయూత నిడవె! లక్ష్మీనృసింహ.

వారాహ రామ నరసింహ రమాది కాంతా
క్రీడావిలోల! విధిశూలిసుర ప్రవంద్య!
హంసాత్మకం పరమహంస విహార లీలం
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్!

క్రోడ నరసింహ రామాది రూప! పద్మజాది కాంతావిలోల! బ్రహ్మాది దివిజ వంద్య! హంసాత్మ! యోగిహృద్వన విహార! చేరి, చేయూత నిడవె! లక్ష్మీనృసింహ.

మాతా నృసింహశ్చ పితా నృసింహః
భ్రాతానృసింహశ్చ సఖా నృసింహః
విద్యానృసింహో ద్రవిణం నృసింహః
స్వామీ నృసింహ స్సకలం నృసింహః!

తల్లి శ్రీనరసింహుఁడు, తండ్రి నృహరి, భ్రాత నారసింహుండు, మిత్రంబు నృహరి, యఖిలవిద్యలు నృహరి, భాగ్యములు నృహరి, స్వామి నరసింహుఁడీ సమస్తంబు నృహరి.

ప్రహ్లాద మానస సరోజ విహార భృంగ
గంగా తరంగ ధవళాంగ రమాస్థితాంగ
శృంగార సంగర కిరీట లసద్వరాంగ
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్!

శ్రీయుత శుభాంగ! ప్రహ్లాద హృదయ కమల భృంగ! గంగాతరంగ సితాంగ! దివ్య మకుట సంశోభితామల మస్తకాంగ. చేరి, చేయూఁత నిడవె! లక్ష్మీనృసింహ.

శ్రీ శంకరార్య రచితం సతతం మనుష్య
స్తోత్రం పఠే దిహతు సర్వగుణ ప్రసన్నం
సద్యోవిముక్త కలుషో మునివర్య గణ్యో
లక్ష్మీపతేః పదముపైతి సనిర్మలాత్మా!

ఆదిశంకర భగవత్పాదార్య రచితమైన యీ స్తోత్రముఁ బఠించు నతఁడు విగత పాపుడై, మునివరనుతుల్ వడసి, విష్ణు పదముఁజేరును నిర్మల స్వాంతుఁడగుచు.

యన్మాయ యార్జితవపుః ప్రచురప్రవాహ
మగ్నార్తమర్త్యనివహేషు కరావలంబం
లక్ష్మీనృసింహ చరణాబ్జ మధువ్రతేన
స్తోత్రంకృతం శుభకరం భువి శంకరేణ!

వితత మాయాప్రభావ సంసృతి మహాబ్ధి మునిఁగి యార్తులౌ నీ జనములకు సత్కరావలంబనస్తుతిఁ బలుకాడె నృహరి చరణయుగళాబ్జ భృంగమౌ శంకరుండు.

లక్ష్మీనృసింహ విభవే గరుడధ్వజాయ
తాపత్రయోపశమనాయ భవౌషధాయ
తృష్ణాది వృశ్చికజలాగ్ని భుజంగరోగ
క్లేశవ్యయాయ హరయే గురవే నమస్తే!

శ్రీ నృహరి! గరుడ ధ్వజ! త్రివిధతాప హర! భవౌషధ! విభవ! తృష్ణాదివృశ్చికజల వహ్ని భుజగరోగ కష్టనాశ! పాపహర! గురువర! హరి! వందనంబు.

శ్రీ జగద్గురు శ్రీ మచ్ఛంకరాచార్య రచిత శ్రీ లక్ష్మీ నృసింహ స్తోత్రమ్ సంపూర్ణమ్.

ఆదిశంకర భగవత్పాదార్య రచిత
మైన లక్ష్మీనృసింహ కరావలంబ
నస్తవంబాంధ్ర మొనరించి నతులతోడ
శ్రీ నృసింహ పదములకర్పించె హనుమ!

ఓమ్ నమో భగవతే తుభ్యం పురుషాయ మహాత్మనే
హరయేద్భుత సింహాయ బ్రహ్మణే పరమాత్మనే



స్వభక్త పక్షపాతేన తద్విపక్ష విదారణమ్
నృసింహమద్భుతం వందే పరమానంద విగ్రహమ్.

# శ్రీ భజగోవింద స్తోత్రము



వంశీవిభూషిత కరా న్నవనీర దాభాత్
పీతాంబరా దరుణ బింబఫలాధ రోష్ఠాత్
పూర్ణేందు సుందర ముఖాదరవింద నేత్రాత్
కృష్ణాత్పరం కిమపితత్త్వ మహం నజానే.

[మధుసూదన సరస్వతి]

# శ్రీ భజగోవింద స్తోత్రము – పీఠిక

శ్రీ శంకర భగవత్పాదులు తన శిష్యులతో కొంతకాలము కాశీపురమున నివసించిరి. వారు వేకువజామున గంగానదికి స్నానార్థమై వెడలు మార్గమున నొక యింట నా బాల్యము వ్యాకరణ శాస్త్రమభ్యసించుచున్న బ్రాహ్మణుఁడొకఁడు వ్యాకరణ సూత్రముల వల్లించుచుండెను. కొన్నిదినములు శ్రీ జగద్గురువులా విప్రుని గమనించిరి. ఒక దినమున శిష్యులతోఁగూడి ప్రభాతకాలమున స్నానార్థమై గంగానదికి వెడలుచు నా విప్రుడు "డుకృఞ్కరణే" అను వ్యాకరణ సూత్రమును వల్లించుచుండ శ్రీ శంకర దేశికులచట నిలిచి యాతని ననుగ్రహింపఁదలఁచి,

"భజగోవిందం భజగోవిందం భజగోవిందం మూఢమతే
సంప్రాప్తే సన్నిహితేకాలే నహినహిరక్షతి డుకృఞ్ కరణే"

అని పలికి, యిది పల్లవిగాఁగల ద్వాదశమంజరి స్తోత్రమును వచించిరి. శ్రీ భగవత్పాదుల శిష్యులా పదునలుగురు దేశికుల యనుజ్ఞ ననుసరించి, చతుర్దశ మంజరికా స్తోత్రమును పలికిరి.

అప్పటికా విప్రుఁడు మేలఁకువఁగాంచి, కడచిన జీవితమంతయు వ్యర్థమయ్యెనని తలంచి శ్రీ జగద్గురువులకుఁ బ్రణమిల్లి, శ్రీ శంకరాచార్యులు వారి శిష్యులు పలికిన శ్లోకముల తత్త్వసారములని గ్రహించి కృతార్థుఁడయ్యెను. సకలోపనిషత్సారభూతములగు నీ భజగోవింద స్తోత్రరత్నములను సోదర భక్తులు నిత్యము స్మరించి ధన్యులగుదురు గాత!

ఓమ్
నమః శ్రీకృష్ణాయ భగవతే

## శ్రీ గోవింద ద్వాదశ మంజరికా స్తోత్రమ్

భజగోవిందం భజగోవిందం
భజగోవిందం మూఢమతే
సంప్రాప్తే సన్నిహితే కాలే
నహినహి రక్షితి "డుకృఞ్కరణే" (ధ్రువమ్)

భజింపు! గోవిందుని మూఢమతీ! భజింపు శ్రీ గోవిందు;
నిజంబు మృతివేళను రక్షింపవు నిన్ని విద్యల వెందు. (ధ్రువము)

మూఢ జహీహి ధనాగమ తృష్ణాం
కురు సద్బుద్ధిం మనసి వితృష్ణాం
యల్లభసే నిజ కర్మోపాత్తం
విత్తం తేన వినోదయ చిత్తమ్! (భజగోవిందం)

పోరి విత్తార్జన రతి విడనాడుము, మూర్ఖ! నిరాశను గనుము;
దొంకిన లవమేన్ బదివేలని సంతుష్టిని మదిఁగని మనుము. (భజింపు గోవిందుని)

నారీ స్తన భర నాభీదేశం
దృష్ట్వా మాగా మోహావేశం
ఏతన్మాంసవసాది వికారం
మనసి విచింతయ వారం వారమ్! (భజగోవిందం)

పొలఁతుల కుచనాభీస్థలములఁ గని మోహావేశము విడుము;
తెలియుమి మాంస వికారములవి యని, స్థిరము విరక్తినిఁ గనుము. (భజింపు గోవిందుని)

నళినీదళగత జలమతి తరళం
తద్వజ్జీవిత మతిశయ చపలమ్
విద్ధి వ్యాధ్యభి మానగ్రస్తం
లోకం శోకహతం చ సమస్తమ్! (భజగోవిందం)

జలజపత్రమున నీటిబిందువటు చంచల మీ జీవంబు;
అఖిషు వ్యాధ్యభి మాన శోక హత మనికను మీ లోకంబు. (భజింపు గోవిందుని)

యావద్విత్తో పార్జన సక్త
స్తావన్నిజ పరి వారో రక్తః
పశ్చాజ్జీవతి జర్ఝర దేహే
వార్తాంకోఽపిన పృచ్ఛతి గేహే! (భజగోవిందం)

ధనము గడింపఁ గలంత కాలమును దలియుదురీ నీవారు;
తనువు సడలి యార్జనముడిగిన నిన్ దలఁపున నే న్గానఁటోరు. (భజింపు గోవిందుని)

యావత్పవనో నివసతి దేహే
తావత్పృచ్ఛతి కుశలం గేహే
గతవతి వాయౌ దేహాపాయే
భార్యా బిభ్యతి తస్మిన్కాయే! (భజగోవిందం)

ప్రాణమున్న తటి నెల్లరుఁ జేరుచుఁ బ్రశ్నింతురు కుశలంబు;
ప్రాణము వాసిన కాయంబును గని భార్యయు పొందు భయంబు. (భజింపు గోవిందుని)

అర్థ మనర్థం భావయ నిత్యం
నాఽస్తి తతస్సుఖ లేశ స్సత్యం
పుత్రాదపి ధన భాజాం భీతి
స్సర్వత్రైషా విహితా రీతిః (భజగోవిందం)

ధనమనర్థమని తలంపుము సతతము దానలేదు సుఖలవము;
ధన భాజుండు భయపడు సుతునేన్ గని తగు నిటులెల్లెడ ధ్రువము. (భజింపు గోవిందుని)

బాలస్తావ త్క్రీడా సక్త
స్తరుణ స్తావ త్తరుణీ సక్తః
వృద్ధస్తావ చ్చింతా సక్తః
పరమే బ్రహ్మణి కోఽపి న సక్తః (భజగోవిందం)

ఎంతయు నాటల బాల్యము వ్యయమగు నింతులతో జవ్వనము;
చింతల వార్ధక్యముఁజను, శ్రీహరి చింతన కదనును గనము. (భజింపు గోవిందుని)

కాతే కాంతా కస్తే పుత్ర
స్సంసారోఽయ మతీవ విచిత్రః
కస్యత్వం వా కుత ఆయాతః
తత్త్వం చింతయ తదిహ భ్రాతః (భజగోవిందం)

ఎవతె? నీదుసతి, సుతుఁడెవఁ? డీసంసృతిఁగన నతి చిత్రంబు!
ఎవనివాఁడ? వెటనుండి వచ్చితివి? యెఱుఁగు భ్రాత! తత్త్వంబు. (భజింపు గోవిందుని)

సత్సంగత్వే నిస్సంగత్వం
నిస్సంగత్వే నిర్మోహత్వం
నిర్మోహత్వే నిశ్చల తత్త్వం
నిశ్చల తత్త్వే జీవన్ముక్తిః (భజగోవిందం)

సాధుమైత్రి నిస్సంగతఁ గనుటను శమయును మోహాసక్తి;
సాధిత నిశ్చల తత్త్వంబునఁ గాల చందగు జీవన్ముక్తి. (భజింపు గోవిందుని)

వయసి గతేకః కామ వికార
శ్శుష్కే నీరేకః కాసారః
క్షీణే విత్తేకః పరివారో
జ్ఞాతే తత్త్వే కస్సంసారః (భజగోవిందం)

చనిన జవ్వనము, కామంబున్నే? జలమింకినఁ గొలఁ కున్నే?
ధనముడిగిన పరి జనమున్నే? తత్త్వముఁగన సంసృతియున్నే? (భజింపు గోవిందుని)

మాకురు ధన జన యౌవన గర్వం
హరతి నిమేషా త్కాల స్సర్వమ్
మాయామయ మిద మఖిలం హిత్వా
బ్రహ్మ పదం త్వం ప్రవిశ విదిత్వా (భజగోవిందం)

పెనుపకు ధన జన యౌవన గర్వము ద్రెల్చుఁ ద్రుటినిఁ గాలంబు; కని
యిది యెల్లను మాయా మయమని కడఁగి చొఱుము బ్రహ్మంబు. (భజింపు గోవిందుని)

దినయామిన్యౌ సాయంప్రాత
శ్శిశిర వసంతౌ పునరాయాతః
కాలః క్రీడతి గచ్ఛత్యాయు
స్తదపి నముంచత్యాశావాయుః. (భజగోవిందం)

రేలు పవలు నుదయాస్తమయమ్ములు ఋతువులుఁ గ్రమ్మఱు చుండుఁ,
గాలముఱఁగు నాయువుఁజను నాశా గ్రంధులు సడల వొకండు. (భజింపు గోవిందుని)

ద్వాదశ మంజరికా భి రశేషః
కధితో వైయా కరణ స్యైషః
ఉపదేశోఽభూ ద్విద్యానిపుణైః
శ్రీమచ్ఛంకర భగవచ్చరణైః (భజగోవిందం)

పలికె నాడిశంకర దేశికుఁడీ ద్వాదశ మంజరి బోధఁ
దలఁగఁబెట్టె వైయాకరణుని విద్యాసంగంబుల బాధ. (భజింపు గోవిందుని)

శ్రీ గోవింద ద్వాదశ మంజరికాస్తోత్రం సంపూర్ణమ్.

—0—

# మోహముద్గర శేషము

శత్రౌ మిత్రే పుత్రే బంధౌ
మాకురు యత్నం విగ్రహసంధౌ
సర్వస్మి న్నపి పశ్యాత్మానం
సర్వత్రోత్సృజ భేదజ్ఞానమ్! (భజగోవిందం)

పలుపలువేరిమి కూరుములను సుత బంధు హితాఽహితులందు;
అరయు మాత్మ నెల్లెడలను, విడు భేదాఽజ్ఞానము జగమందు. (భజింపు గోవిందుని)

సుఖతః క్రియతే రామాభోగః
పశ్చాద్ధంత శరీరే రోగః
యద్యపిలోకే మరణం శరణం
తదపినముంచతి పాపాచరణమ్! (భజగోవిందం)

తరుణీభోగము సుఖమని తలచుఁ దుదన్ గను మేన్ రోగంబు;
మరణమె శరణంబైనను లోకము మానదఘా చరణంబు. (భజింపు గోవిందుని)

ప్రాణాయామం ప్రత్యాహారం
నిత్యాఽనిత్య వివేక విచారమ్
జాప్యసమేత సమాధి విధానం
కుర్వవధానం మహదవధానమ్! (భజగోవిందం)

ప్రాణనియతి నింద్రియ జయమును నిత్యాఽనిత్య వివేచనము
ధ్యానసమేత సమాధిఁబడసి, బ్రహ్మానందంబును గనుము. (భజింపు గోవిందుని)

గురుచరణాంబుజ నిర్భరభక్తః
సంసారాదచిరాద్భవముక్తః
సేంద్రియమానస నియమాదేవం
ద్రక్ష్యసి నిజహృదయస్థం దేవమ్! (భజగోవిందం)

సాంద్ర భక్తి గురుపదాబ్జనిష్ఠను సంసృతిముక్తినిఁ బొందు
నింద్రియ నిగ్రహుఁడగు యోగి కనున్ హృదయస్థుని గోవిందు. (భజింపు గోవిందుని)

మోహముద్గర శేషము సంపూర్ణము.

# శ్రీ గోవింద చతుర్దశ మంజరికా స్తోత్రమ్

పద్మపాదాచార్యులు :

కాతే కాంతా ధనగత చింతా
వాతుల కింతవ నాఽస్తి నియంతా
త్రిజగతి సజ్జన సంగతి రేకా
భవితి భవార్ణవ తరణేనౌకా!

పొరి విత్తార్జన చింత ప్రియంబా? మూఢ! నియంతలు లేర?
శరణము సత్సంగతి పోతమ_భవసాగర పారముఁ జేర. (భజింపు గోవిందుని)

తోటకాచార్యులు :

జటిలోముండీ లుంచిత కేశః
కాషాయాంబర బహుకృతవేషః
పశ్యన్నపిచ నపశ్యతి మూఢో
హ్యుదరనిమిత్తో బహుకృతవేషః! (భజగోవిందం)

జడలు ముండనము లుంఛితకేశము శాటీల్ దాల్చినవారు
కడుపునింపు వేషధారులగుటను గనియుఁ గానఁగా లేరు. (భజింపు గోవిందుని)

హస్తామలకాచార్యులు :

అంగం గళితం పలితం ముండం
దశనవిహీనం జాతంతుండం
వృద్ధోయాతి గృహీత్వా దండం
తదపి నముంచత్యాశాపిండమ్! (భజగోవిందం)

తనువు సడలి వంగెను బొచ్చూడెను దగ నెఱసెను మస్తకము
పెనుముదిమినిఁగఱ్ఱనూఁతఁగొని నను విడఁబోదాశా భరము. (భజింపు గోవిందుని)

సుబోధుఁడు :

అగ్రేవహ్నిః పృష్ఠే భానుః
రాత్రౌ చుబుక సమర్పితజానుః
కరతలభిక్ష స్తరుతల వాస
స్తదపినముంచ త్యాశాపాశః! (భజగోవిందం)

ఇరుజానులఁ జుబుకంబిడి యనలము నెదుట రేలపడఁ కాచు
కరతల భిక్షుఁడుఁదరు తలవాసుఁడ కాని, యాసవిడఁబోఁడు. (భజింపు గోవిందుని)

వార్తికకారుఁడు :

కురుతేగంగా సాగర గమనం
వ్రతపరిపాలన మథవా దానమ్
జ్ఞానవిహీన స్సర్వమతేన
ముక్తిం నభజతి జన్మశతేన! (భజగోవిందం)

దానవ్రతములు, గంగనుదధులన్ తానాల్ సలిపిననైన
జ్ఞానవిహీనుఁడు మోక్షముఁగాంచఁడు జన్మశతంబులకైన. (భజింపు గోవిందుని)

నిత్యానందుఁడు :

సురమందిర తరు మూలనివాస
శ్శయ్యా భూతల మజినం వాసః
సర్వపరిగ్రహ భోగత్యాగః
కస్యసుఖం నకరోతి విరాగః! (భజగోవిందం)

తరుతలవాసం బజినచేలమును ధాత్రీస్థలి శయనంబు,
నొఱపు విరాగి పరిగ్రహ భోగములుడిగి కనఁడె సౌఖ్యంబు. (భజింపు గోవిందుని)

ఆనందగిరి :

యోగరతో వా భోగర తోవా
సంగరతోవా సంగవిహీనః
యస్యబ్రహ్మణి రమతే చిత్తం
నందతి నందతి నందత్యేవ! (భజగోవిందం)

హృదిబ్రహ్మంబునఁ జేర్చి సతంబు రమించి సుఖించు నతండు
పొదలు యోగభోగ సంగమంబులఁ బొరలియు నిస్సంగుండు. (భజింపు గోవిందుని)

దృఢభక్తుఁడు :

భగవద్గీతా కించిదధీతా
గంగాజల లవ కణికా పీతా
సకృదపి యేనమురారి సమర్చా
క్రియతేతస్యయమోఽపినచర్చామ్! (భజగోవిందం)

హరి పూజనమును గీతాధ్యయనము నమర నదీసేవనము
నఱుదుగ నే నొనరింపఁజాలు నరుడందునె? యమదర్శనము. (భజింపు గోవిందుని)

నిత్యనాథుఁడు :

> పునరపి జననం పునరపి మరణం
> పునరపి జననీ జఠరే శయనమ్
> ఇహసంసారే బహు దుస్తారే
> కృపయా పారే పాహి! మురారే! (భజగోవిందం)

జనన మరణములు పలుమఱు జననీ జఠరాంతర శయనంబుఁ
గను సంసారము దుస్తర మీశ్వర! కరుణఁబఱపు వైళంబు. (భజింపు గోవిందుని)

యోగానందుఁడు :

> రథ్యాకర్పట విరచిత కంథః
> పుణ్యాఽపుణ్య వివర్జిత పంథాః
> యోగీ యోగ నియోజిత చిత్తో
> రమతే బాలోన్మత్తవదేవ! (భజగోవిందం)

పైన బొంతనిడి, పుణ్య పాప పరివర్జిత మార్గములోన
నానందించును బాలుఁడు వేదురు నటుల యోగి డెందాన. (భజింపు గోవిందుని)

సురేంద్రుఁడు :

> కస్త్వం కోఽహం కుత ఆయాతః
> కామే జననీ కోమే తాతః
> ఇతి పరిభావిత నిజసంసార
> స్సర్వం త్యక్త్వా స్వప్న విచారః! (భజగోవిందం)

ఎవరము? మన మెటనుండి వచ్చితిమి? యెవరీ తలిదండ్రులును,
ధ్రువమతి స్వప్నసమంబిదియని కడఁద్రోయుము నిస్సారమును. (భజింపు గోవిందుని)

మేథాతిథి :

> త్వయిమయి సర్వత్రైకో విష్ణు
> ర్వ్యర్థం కుప్యసి మయ్యసహిష్ణుః
> భవసమ చిత్త స్సర్వత్ర త్వం
> వాంఛస్యచి రా ద్యది విష్ణుత్వమ్! (భజగోవిందం)

హరి మయ మీవును నేను సకలము వ్యర్థ కోపమిది యేల?
అరయుము భేదజ్ఞాన ముడిగి, నిజాత్మ నెల్లెడలఁగ్రాల. (భజింపు గోవిందుని)

భారతీవంశుఁడు :

కామం క్రోధం లోభం మోహం
త్యక్త్వా త్మానం పశ్యతి సోఽహమ్,
ఆత్మజ్ఞాన విహీనా మూఢా
స్తేపచ్యంతే నరక నిగూఢాః! (భజగోవిందం)

అడఁపుము కామ క్రోధ లోభ మోహములీవెపుఁడవొః కనుము!
పడయు దురాత్మ జ్ఞాన విమూఢులు భయద నరక మేకతము. (భజింపు గోవిందుని)

సుమతి :

గేయం గీతా నామసహస్రం
ధ్యేయం శ్రీపతిరూప మజస్రమ్
నేయం సజ్జన సంగతి మనిశం
దేయం దీనజనాయచ విత్తమ్ (భజగోవిందం)

పలుకుము గీతల నామసహస్రముఁ, బలుపుము హరి చింతనముఁ;
దలఁపు నిలుపు సజ్జన సంగతిఁ బేదల కొఱకిడుమీ ధనము. (భజింపు గోవిందుని)

మూఢః కశ్చన వైయాకరణో
డుకృఞ్ కరణాధ్యయన ధురీణః
శ్రీమచ్ఛంకర భగవచ్ఛిష్యైః
ర్బోధిత ఆసీ చ్ఛోదిత కరణః (భజగోవిందం)

పలికె చతుర్దశ మంజరి శంకర భగవత్పద శిష్యాళి,
కలమోహముఁ బో[ద్రో]సెను వైయా కరణుఁడు హితవాక్యాళి. (భజింపు గోవిందుని)

శంకర గురుతచ్ఛిష్యుల బోధల
సారముఁదెను గొనరించి
యంకిత మిడె శ్రీ గోవిందునకీ
హనుమ వినతులర్పించి!

శ్రీ గోవింద చతుర్దశ మంజరికా స్తోత్రము సంపూర్ణము

# శ్రీ ముకుందమాలా స్తోత్రము - పీఠిక

ఈ స్తోత్రరాజమును రచించినవారు మలయాళదేశాధీశ్వరులగు శ్రీ కులశేఖర మహారాజుగారు. వీరు శ్రీ మహావిష్ణువు కౌస్తుభాంశమున కేరళ దేశమున చోళ పట్టణమున పునర్వసువు నక్షత్రయుక్త కుంభలగ్నమున జనించిరని చెప్పుదురు. వీరి యవతారకాలము కలియుగాది యందలి శ్రీవైష్ణవ పరంపరా గ్రంథములందుఁ జెప్పఁబడియున్నది. శ్రీవైష్ణవ సాంప్రదాయమునందు వీరు పదుగురు ఆళ్వారులలోఁ జేరినవారు. వీరిని "శ్రీకులశేఖరాళ్వారులు" అని శ్రీవైష్ణవులు చెప్పుదురు. శ్రుతి పారగులు కవిలోకవీరులగు ద్విజన్మవర్యుఁడు - పద్మశర్యుఁడు అను మిత్రులుగలరని యీ స్తోత్రము చివర శ్రీకుల శేఖరులే వచించిరి.

శ్రీకులశేఖరులవారి భగవద్భక్తి అపారమైనది. వీరు శ్రీరంగయాత్రకై వెడలఁదలఁచి తనవెంట రాఁదలఁచినవారు రావచ్చునని తన రాజధానియందుఁ జాటఁబంచువారు. ఉదయమున కాలకృత్యముల నిర్వర్తించుకొని శ్రీరంగయాత్రకై వెడలు సమయమున భాగవతోత్తముఁడొకంతు రాజమందిరమునకేతెంచువాఁడు. భగవత్సేవ కంటె భాగవతసేవ విశిష్టమని గుర్తించిన యా రాజచంద్రుఁడు తనయింటికేతెంచిన భాగవతోత్తముని యథావిధిఁ బూజించి భోజనాదులచే సంతృప్తిఁ బఱపి సద్గోష్టిఁ జరిపి, మఱలఁ దనపురమున శ్రీరంగయాత్రఁజాటఁబంచువాఁడు.

ఈ విధముగఁ బ్రతి దినము శ్రీరంగ యాత్రకై వెడలఁబోవు సమయమున భాగవత శిఖామణి యొకఁ డెదురగుట సంభవించెను. తుదకు శ్రీరంగనాయకస్వామి దర్శనభాగ్యము తనకు లేదేమో! యని నిర్వేదపడ శ్రీరంగనాథుఁడే ప్రత్యక్షమై "బిడ్డా! నేనే నిత్యము నీదరి కేతెంచి నీ పూజలను స్వీకరించి యానందించుచుంటిని. నీవంతదూరము ప్రయాసపడి రానేల?" యని యాశ్వాసించెను. వీరి విషయమున నిట్టి భక్తి మహిమాతిశయ గాథలను బెక్కు చెప్పుచుందురు.

సకల పురుషార్థ ప్రదాతయగు శ్రీ మహావిష్ణువును వీరు తొలుదొలుత "ముకుంద!" యని సంబోధించుటచే ఈ స్తోత్ర రత్నమునకు "శ్రీ ముకుందమాల" అను పేరు గలిగినది. [ము = ముక్తిని, కుం = భూమిని - ఇహపరలోకసుఖములను, ద=ఇచ్చువాఁడు] అనగా ఇహపరలోక విభవముల ప్రసాదించువాఁడు అని ముకుంద శబ్దార్థము. జనన మరణ రూపమగు సంసార చక్రభ్రమణమున జిక్కువడిన జీవికి ఇహలోకమునఁ, బరలోకమున సుఖ సంతోష శాంతులకంటెఁ గోరఁదగినవి

మతేవియు లేవు. వీనిని బ్రిసాదింప సమర్థతగుటచేతనే శ్రీకృష్ణభగవానునకు "ముకుందుడు" అను ప్రసిద్ధ నామము కలిగినది. ఈ స్తోత్రరత్నమునందు శ్రీకృష్ణావతార వైభవమే ప్రతిపాదింపబడినది. శ్రీ ముకుందునుద్దేశించి స్తోత్ర రత్నములను మాలగా గూర్చి యా జగత్పితకు సమర్పింపబడుటచే నీకృతికి "శ్రీ ముకుందమాల" యను సార్థక నామము గలిగినది. ఈ స్తవరాజమును విష్ణు భక్తులెల్లరు వేద తుల్యముగ భావించి నిత్యము గీర్తించి యానందింతురు.

ఇహపరార్థప్రదాన దక్షమగు శ్రీ ముకుందమాలను సోదర భక్తులందఱు నిత్యము బఠించి శ్రీ కృష్ణానుగ్రహమున సుఖసంతుష్టి సంతృప్తి శాంతులను బడయుదురుగాత!

## శ్రీ ము కు ం ద మా ల

## కవిస్తుతి

ఘుష్యతే యస్య నగరే రంగయాత్రా దినేదినే
తమహం శిరసా వందే రాజానం కులశేఖరమ్॥

శ్రీరంగయాత్ర నిత్యం
బేరాజ నగరమున బ్రకటింపంబడు నా
శ్వీరగు నా కులశేఖర
భూరమణు పదాంబుజముల మ్రొక్కెద వినతిన్.

కుంభే పునర్వసౌ జాతం కేరళే చోళ పట్టణే
కౌస్తుభాంశం ధరాధీశం కులశేఖర మాశ్రయే.

కేరళాఖ్యమౌ దక్షిణ భారతమున
చోళ నగరంబున బునర్వసువున గుంభ
లగ్నమున గౌస్తుభాంశ నిలాధిపతిగ
నవతరించిన కులశేఖరార్యు గొలుతు.

ఓమ్

నమః శ్రీ కృష్ణాయ భగవతే! శ్రీ సాయీ సద్గురవే నమః!

# శ్రీ ముకుందమాల

శ్రీ వల్లభేతి వరదేతి దయాపరేతి
భక్తప్రియేతి భవలుంఠన కోవిదేతి
నాథేతి నాగశయనేతి జగన్నివాసే
త్యాలాపనం ప్రతిపదం కురుమే ముకుంద!

శ్రీ రమామనోహర! నాథ! శేషశయన! వరద! భక్తప్రియా! దయాశరధి! భువన వాస! భవహర! యనుచును బ్రతిపదంబు నీ సమాలాపమిడవె! తండ్రీ! ముకుంద.

జయతు జయతు దేవో దేవకీనందనోఽయం
జయతు జయతు కృష్ణో వృష్ణివంశ ప్రదీపః
జయతు జయతు మేఘశ్యామలః కోమలాంగో
జయతు జయతు పృథ్వీభారనాశో ముకుందః!

దేవకీనందనా! వాసుదేవ! జయము వృష్ణివంశప్రదీపక! కృష్ణ! జయము, అంబుదశ్యామలా! కోమలాంగ! జయము, కుతల భార వినాశ! ముకుంద! జయము.

ముకుంద మూర్ధ్నా ప్రణిపత్య యాచే
భవంత మేకాంత మియంత మర్థం
అవిస్మృతి స్త్వచ్చరణారవిందే
భవే భవే మేఽస్తు భవత్ప్రసాదాత్!

మాధవా! తలవొగ్గి నమస్కరించి యిదియ-యేకైక వరము నర్థించుచుంటి; త్వత్ప్రసాదంబుచే భవ భవమునందుఁ గలుగుఁగావుత! నీపాదకమల భక్తి.

నాఽహంవందే తవచరణయోర్ద్వంద్వ మద్వంద్వ హేతో
కుంభీపాకం గురు మపిహరే నారకంనాప నేతుం
రమ్యారామా మృదు తను లతా నందనేవాఽపి రంతుం
భావే భావే హృదయభవనే భావయేయం భవంతమ్!

ఇందు భజింప ద్వంద్వముల నెల్లను రూపఱఁజేయ, నారకం
బందగుబాధలన్ గెడపు నాస, సుఖంబుగఁగ్రీడ సల్పనా
నందనసీమఁజేరుమతి; నాకగు జన్మలనెల్ల నాదు హృ
న్మందిరమందు నిల్వుమని మాత్రము వేడెద? నందనందనా.

నాస్థా ధర్మే నవసు నిచయే నైవకామోపభోగే
యద్యద్భవ్యం భవతి భగవన్ పూర్వకర్మానురూపం
ఏతత్ప్రార్థ్యం మమ బహుమతం జన్మజన్మాంతరేఽపి
త్వత్పాదాంభోరుహ యుగగతా నిశ్చలా భక్తిరస్తు!

తలఁపున్ నిల్పను భోగలాలసుఁడనై ధర్మార్థ కామంబులన్
గలుగంగాఁ దగు నా సమస్తమును ప్రాక్కర్మానుసారంబుగాఁ
జెలఁగున్; గాని, భవత్పవిత్రపద రాజీవప్రతిష్ఠాప్య ని
శ్చల భక్తిన్ గలిగింపఁ గోరెదను; కృష్ణా! జన్మజన్మంబులన్.

దివివా భువివా మమాఽస్తు వాసో
నరకేవా నరకాంతక ప్రకామం;
అవధీరిత శారదారవిందౌ
చరణౌ తే మరణేఽపి చింతయామి!

నాకమునఁగాని, భువిఁగాని, నరకముననుగాని యునికి నాకీయు మెందైన మేలు;
శారదాబ్జముల్ గేరు నీ చరణములను స్మరణఁ జేయనిమ్మో కృష్ణ! మరణవేళ.

కృష్ణ త్వదీయ పదపంకజ పంజరాంత
మద్యైవమే విశతు మానస రాజహంసః
ప్రాణప్రయాణ సమయే కఫవాత పిత్తైః
కంఠావరోధన విధౌ స్మరణం కుతస్తే?

సరసిజగర్భ దేవముని సంస్తుత! త్వత్పదకంజ పంజరాం
తరమునఁ జేరనిమ్మిపుడ నాదగు మానస రాజహంసమున్
గుఱు కఫవాత పిత్తములు కుత్తుక వట్టుచు బాధపెట్ట నీ
స్మరణము లేశమేన్ సలుపసాధ్యమో? మృత్యువు డాయుపట్టునన్.

చింతయామి హరిమేవ సంతతం
మంద మంద హసి తాననాంబుజం
నందగోప తనయం పరాత్పరం
నారదాది మునిబృంద వందితమ్!

డెందమందెంతు సతము గోవిందు నార
దాది మునిబృంద వందితు, హరిఁ బరేశు
నంద గోపక నందను సుందరాంగు
మంద మందస్మిత ముఖారవిందుఁ గృష్ణు!

కరచరణ సరోజే కాంతిమన్నేత్రమీనే
శ్రమముషి భుజవీచి వ్యాకులేఽగాధ మార్గే
హరిసరసి విగాహ్యాపీయ తేజో జలౌఘం
భవమరు పరిఖిన్నః ఖేద మద్యత్యజామి!

శౌరి, భవరూపమైన మరుభూమిఁ జరించుట గాసినొంది యీ
కరచరణాబ్జముల్ లలిత కాంతులసీనెడు నేత్రమీనముల్
ఒరివగు బాహువీచులు, గభీరము దివ్యమునైన కృష్ణ స
త్సరసిని దోఁగి యంబువులఁ ద్రావి, విషాదము లింకఁబాసెదన్.

సరసిజనయనే సశంఖ చక్రే
మురభిది మా విరమస్వ చిత్తరంతుం
సుఖతర మపరం నజాతు జానే
హరిచరణ స్మరణామృతేన తుల్యమ్!

సరసిజాక్షి శంఖ చక్రి హస్తు ముకుంది భజనమెపుడు విడఁగవలదు మనస!
హరిపదాబ్జ చింతనామృతమునకంటె సుఖతరమగు దానిఁజూడ నెందు.

మాభీర్మందమనో విచింత్య బహుధా యామీశ్చిరం యాతనా
నామీనః ప్రభవంతి పాప రిపవః స్వామీననుః శ్రీధరః
ఆలస్యం వ్యపనీయభక్తి సులభం ధ్యాయస్వ నారాయణం
లోకస్యవ్యసనాపనోదనకరో దాసస్య కిన్నక్షమః?

నరకం బందగు బాధలన్ దలఁచి లోనన్ జంకుదేః దుర్మతీ!
వరందుం దేలికగానఁ, బాపరిపు లేపన్ లేరు నిన్నెందు; నో.
మరిపాటున్ విడనాడి, భక్తి సులభున్ మానాథు ధ్యానింపు; మం
దటఁ ఖేదంబులఁ బాపనోపి శ్రితుని న్గాపాడ వెన్నాఁడునేః

భవజలధి గతానాం ద్వంద్వవాతా హతానాం
సుత దుహితృ కళత్రత్రాణ భారార్దితానాం
విషమ విషయతోయే మజ్జతా మప్లవానాం
భవతు శరణమేకో విష్ణుపోతో నరాణామ్!

భరసంసార మహాంబుధిన్ బతితులై ద్వంద్వానిలో ద్ధూతులై
తరుణీపుత్త్రి సుతాది రక్షణ బృహద్భారింబునన్ దస్సి, య
స్థిరమౌ నింద్రియ భోగతోయముల నాడ్డన్ ముని దాటంగనే
తరణిన్ గానసి వారికెల్ల హరి పోతంబె శరణ్యంబగున్.

భవజలధి మగాధం దుస్తరం నిస్తరేయం
కథమహ మితిచేతో మాస్మగాః కాతరత్వం;
సరసిజ దృశి దేవే తావకీ భక్తి రేకా
నరక భిది నిషణ్ణా తార యిష్యత్యవశ్యమ్!

"కన లోతింతన రాక దుస్తరమునై కన్పట్టు సంసార వా
ర్ధిని నేనెట్లు తరింతునా?" యనుచు భీతిన్ బొందఁగాఁబోకుమా!
వనజాక్షామల పాద పద్మ యుగళీ భక్తి ప్రసైక నౌ
కనినున్ బారముఁజేర్చు మానసమ! యింకన్ గృష్ణు సేవింపుమా.

తృష్ణాతోయే మదన పవనోద్ధూత మోహోర్మిమాలే
దారావర్తే తనయ సహజగ్రాహ సంఘా కులేచ
సంసారాఖ్యేమహతి జలధౌ మజ్జతాం నస్త్రిధామన్
పాదాంభోజే వరద భవతో భక్తినావం ప్రయచ్ఛ!

ఉరుతృష్ణా సలిలంబులన్ మదన వాతోద్ధూత మోహోర్మికో
త్కరమున్ బంధుజలేచరంబులఁ గళత్రావర్తముల్ గల్గి, దు
స్తరసంసార మహోగ్రసాగరము మధ్యన్ మున్గునాకిమ్ము త్వ
చ్చరణాంభోరుహ భక్తి పోతమును గృష్ణా! భక్తసంరక్షణా!

మాద్రాక్షంక్షీణపుణ్యాన్ క్షణమపిభవతో భక్తిహీనాన్ పదాబ్జే
మాశ్రౌషం శ్రావ్యబంధంతవచరితమపాస్యాన్యదాఖ్యానజాతం
మాస్మార్షంమాధవ త్వామపిభువనపతేచేతసాపహ్నువానాన్
మాభూవం త్వత్సపర్యావ్యతికర రహితో జన్మజన్మాంతరేపి!

క్షణమేన్ నీ పదకంజ భక్తిగన నోచన్లేని పాపాత్ములన్
గనకే, నీ చరితేతరం బయిన యన్యశ్రావ్య బంధంబెదేన్
వినకే, నిన్మది నిల్పఁబోని జనులన్ నే నెంచకే, త్వత్పదా
ర్చనమెందేమఱసీక నన్మనవె! కృష్ణా! జన్మజన్మంబులన్.

జిహ్వేకీర్తయ కేశవం మురరిపుం చేతో భజ శ్రీధరం
పాణిద్వంద్వ సమర్చ యాచ్యుత కథా శ్రోత్రద్వయత్వంశ్రుణు
కృష్ణంలోకయ లోచనద్వయ హరేర్గచ్ఛాంఘ్రియుగ్మాలయం
జిఘ్ర ఘ్రాణ ముకుందపాద తులసీం మూర్ధ న్నమాధోక్షజమ్!

హరిఁగీర్తింపుమి జిహ్వా! కొల్వుముమతీ! యర్చింపు హస్తద్వయీ!
వరదున్ నేత్రయుగంబ! కన్గొ, శ్రవణద్వంద్వంబ! యాలింపు శ్రీ

కరు, మూర్ధాన్నమ్మ ముకుందపాదతులసిన్ ఘ్రాణంబ! పాదద్వంబా!
మురజిద్వాసముఁజేరఁబొమ్ము యదుసోమున్ మ్రొక్కు మో మూర్ధమా!

హే లోకా శృణుత ప్రసూతి మరణ వ్యాధేశ్చికిత్సా మిమాం
యోగజ్ఞా స్సముదాహరంతి మునయోయాం యాజ్ఞవల్క్యాదయః
అంతర్జ్యోతి రమేయ మేకమమలం కృష్ణాఖ్యమా పీయతాం
తత్పీతం పరమౌషధం వితనుతే నిర్వాణ మాత్యంతికమ్!

వినుఁడీ! యో జనులార! యోగవిదులుర్విన్ యాజ్ఞవల్క్యాది పా
వన మౌనుల్ గనినారు జన్మ మరణవ్యాధి ప్రణాశౌషధం
బనువై, యవ్యయమైనలో వెలుఁగుఁ, గృష్ణాఖ్యామృతానూనసే
వను; తత్సేవయ మీకు నత్యధిక నిర్వాణంబు సంధించెడిన్.

హేమర్త్యాః పరమం హితం శృణుతవో వక్ష్యామి సంక్షేపత
స్సంసారార్ణవ మాపదూర్మి బహుళం సమ్య క్ప్రవిశ్యస్థితాః
నానాజ్ఞాన మపాస్య చేతసి నమో నారాయణా యేత్యముం
మంత్రం సప్రణవం ప్రణామ సహితం ప్రావర్తయధ్వం ముహుః!

బహు విపద్భంగ సంకుల భవమహాబ్ధిఁ బడిన జనులార! వినుఁడి యీ పరమ బోధ;
ప్రణవ నమతి సమేత "నారాయణాయ" మంత్రమును సంతతము జపింపఁగఁ దరింత్రు.

పృథ్వీరేణురణుః పయాంసి కణికాః ఫల్గుస్ఫు లింగోలఘు
స్తేజో నిశ్వసనం మరుత్తనుతరం రంధ్రం సుసూక్ష్మంనభః
క్షుద్రా రుద్ర పితామహ ప్రభృతయః కీటా స్సమస్తాస్సురా
దృష్టేయత్ర సతావకో విజయతే భూమావధూతా వధిః!

ధరణీఖండము స్వల్ప రేణువగు సప్తాంభోనిధుల్ నీటితుం
పరలౌ, జ్యోతి మిణుఁగురౌ, దివి బిళంబౌ, నామహావాతమూ
పిరియౌ, దివ్యచయంబుఁ గీటకముఁలౌ, వీక్షించినన్ నీదు భా
స్వర దివ్యోన్నత వైభవాకృతినిఁ గృష్ణా! భక్త కల్పద్రుమా:

బద్ధేనాంజలినా నతేన శిరసా గాత్రై స్సరోమోద్గమైః
కంఠేన స్వర గద్గదేన నయనేనో ద్గీర్ణ బాష్పాంబునా
నిత్యం త్వచ్చరణారవింద యుగళ ధ్యానామృతాస్వాదినా
మస్మాకం సరసీరుహాక్ష! సతతం సంపద్యతాం జీవితమ్!

కరయుగ్మంబును దోసిలొగ్గఁ గనువీకన్ మూర్ధమున్ మ్రొక్కఁగా
సంరమున్ గద్గదమొందఁగంపముగగుర్పాటున్ గనన్ దేహమున్

వర బాష్పాంబువు లొల్కఁ జక్షులిడి, కాపాడం గదే! కృష్ణ! త్వ
చ్చరణాంభోరుహ చింతనామృతము నాస్వాదించు నన్నెప్పుడున్.

హే గోపాలక హే కృపాజలనిధే హే సింధు కన్యాపతే
హే కంసాంతక హే గజేంద్ర కరుణా పారీణ హే మాధవ
హే రామానుజ హే జగత్త్రయగురో హే పుండరీకాక్ష మాం
హే గోపీ జననాథ పాలయ పరంజానామినత్వాం వినా!

ఓ కారుణ్య పయోనిధీ! ఓ యదువిభూ! ఓ సింధు కన్యాపతీ!
ఓ కంసాంతక! ఓ గజేంద్ర వరదా! ఓ స్వామి! రామానుజా!
ఓ కంజేక్షణ! ఓ జగత్త్రయ గురూ! ఓ గోపికా నాయకా!
నీకన్నన్ గతి! నన్యమే నెఱుఁగఁ; దండ్రీ! కృష్ణ రక్షింపవే!

భక్తాపాయ భుజంగ గారుడమణి స్త్రైలోక్య రక్షామణిః
గోపీలోచన చాతకాంబుదమణి స్సౌందర్య ముద్రామణిః
యః కాంతామణి రుక్మిణీ ఘనకుచ ద్వంద్వైక భూషామణి
శ్శ్రేయో దేవ శిఖామణి ర్దిశతునో గోపాల చూడామణిః

ప్రణతార్త్యురగ గారుడోరుమణి, సర్వాజాండ రక్షాలస
న్మణి, గోపీక్షణ చాతకాబ్దమణి, సౌందర్యైక ముద్రామహా
మణి, గీర్వాణనికాయ మౌళిమణి, పద్మావత్సభూషాచల
న్మణి, నందవ్రజ బాలకృష్ణమణి, ప్రేమన్ మాకిడున్ శ్రేయముల్.

శత్రుచ్ఛేదైక మంత్రం సకలము పనిషద్వాక్య సంపూజ్యమంత్రం
సంసారోత్తార మంత్రం సముపచిత తమస్సంఘ నిర్యాణ మంత్రం
సర్వైశ్వర్యైక మంత్రం వ్యసన భుజగ సందష్ట సంత్రాణమంత్రం
జిహ్వే శ్రీకృష్ణ మంత్రం జప జప సతతం జన్మసాఫల్య మంత్రమ్.

అరివిచ్ఛేదకరైక మంత్రమును వేదాంతోక్త సంపూజ్యమం
త్ర రహస్యంబు, మహాభవోత్తరణ మంత్రంబున్, లసత్సంపదా
కరమంత్రంబుఁ దమోఘ్న మంత్రమును, దుఃఖ ధ్వంస మంత్రంబును
స్థిరలీలన్ జపియింపు జిహ్వా! సతమున్ శ్రీకృష్ణ సన్మంత్రమున్.

వ్యామోహాపహ మౌషధం మునిమనోవృత్తి ప్రవృత్త్యౌషధం
దైత్యేంద్రార్తిక రౌషధం త్రిభువనీ సంజీవనైకౌషధం

భక్తాత్యంత హితౌషధం భవ భయప్రధ్వంస నైకౌషధం
శ్రేయః ప్రాప్తికరౌషధం పిబమన శ్రీకృష్ణ దివ్యౌషధమ్!

ఘనమోహ ప్రశమౌషధం బతుల యోగజ్ఞౌషధం బుగ్రదు
ర్జన దైత్యారిక రౌషధంబుఁ ద్రిజగత్సంజీవనైకౌషధం
బును, సంసారహరౌషధంబు, విలసన్మోక్షౌషధంబైన పా
వనకృష్ణౌషధ మీవు భక్తిమెయి నాస్వాదింపుమీ చిత్తమా!

అమ్నాయా భ్యసనా న్యరణ్యరుదితం వేదవ్రతాన్య న్వహం
మేదశ్ఛేదఫలాని పూర్తవిధయ స్సర్వేహుతం భస్మని,
తీర్థానామ వగాహనానిచ గజస్నానం వినాయత్పద
ద్వంద్వాంభోరుహ సంస్మృతీ ర్విజయతే దేవస్సనారాయణః

వేదాభ్యాస మరణ్యరోదనము. తద్వేద వ్రతాసక్తి దు
ర్మేద శ్ఛేదఫలంబు; పూర్తవిధులర్యిన్ భస్మహోమాలు, గం
గాది స్రోతసులందు మ్రుంకులు మతంగ స్నానముల్ సుమ్మి, త్వ
త్పాదాంభోరుహ భక్తి లేనియెడ దేవా! సత్యనారాయణా!

శ్రీమన్నామ ప్రోచ్య నారాయణాఖ్యం
కేన ప్రాపు ర్వాంఛితం పాపినోఽపి
హానః పూర్వం వాక్ప్రవృత్తాన తస్మిన్
తేన ప్రాప్తం గర్భవాసాది దుఃఖమ్!

...న్ను నారాయణుని నామమును స్మరించి, పాపులేని వాంఛితములఁ బడయఁబోరో
...స్వఁడేన్ గటా: యా నామ మెన్నకున్న కతన గర్భవాసాది దుఃఖములు గలిగె.

మజ్జన్మనః ఫలమిదం మధుకైటభారే
మత్ప్రార్థనీయ మదనుగ్రహ ఏష ఏవః
త్వద్భృత్య భృత్య పరిచారక భృత్య భృత్య
భృత్యస్యభృత్య ఇతిమాం స్మర లోకనాథ!

...మ జన్మ ఫలంబును నాదు ప్రార్థనంబు, శ్రీకృష్ణ! మదనుగ్రహంబు నిదియ;
...బుఁగుమీ నన్నుఁ ద్వద్భృత్య భృత్య భృత్య భృత్య తద్భృత్య భృత్యాను భృత్యుఁ
డనుచు.

నాథేనః పురుషోత్తమే త్రిజగతా మేకాధిపే చేతసా
సేవ్యే స్వస్యపదస్యదాతరి సురే నారాయణే తిష్ఠతి

యేంకంచి త్పురుషాధమం కతిపయ గ్రామేశ మల్పార్థదం
సేవాయైమృగయామహే నరమహో! మూఢావరాకావయమ్!

హరి, హృత్స్థుఁడు స్వప్రకాశుఁడుఁ ద్రిలోకైకాధినాథుఁడు, స
త్పురుష శ్రేష్ఠుఁడు నాథుఁడాత్మపద సన్మోక్షాను సంధాత శ్రీ
కరుఁడౌ కృష్ణునిఁ గానకే కతిపయ గ్రామేశు, నల్పార్థదున్
బురుషభ్రష్టుని సేవఁ జేయఁగ నహూ! మూఢాత్మ! కాంక్షింతువే?

మదన పరిహరస్థితం మదీయే
మనసి ముకుంద పదారవింద ధామ్ని
హర నయన కృశానునా కృశోఽసి
స్మరసి న చక్ర పరాక్రమం మురారేః!

శ్రీ ముకుంద పదాంబుజ ధామమైన మన్మనంబును వదలుమో మదన యింక;
హరనయన వహ్నిచే దగ్ధమైతి వీ మురారి చక్రపరాక్రమం బరయవెపుడు.

తత్త్వం బ్రువాణాని పరంపరస్మాత్
మధుక్షరం తీవ సతాం ఫలాని
ప్రావర్తయ ప్రాంజలి రస్మి జిహ్వే
నామాని నారాయణ గోచరాని.

ప్రణతులివె రసనా! పరాత్పరమునైన తత్త్వ మెఱిఁగింతు వినుము! సన్మానవులకుఁ
దేనెలొలుకు ఫలంబుల తీరుఁదోఁచు కృష్ణనామాళి వల్లింపుమీ! సతంబు.

ఇదం శరీరం పరిణామ పేశలం
పతత్యవశ్యం శ్లథసంధి జర్ఝరం
కిమౌషధై క్లిశ్యసి మూఢ దుర్మతే
నిరామయం కృష్ణ రసాయనం పిబ.

ఈ శరీరంబు పరిణామ పేశలంబు, సంధులెల్ల సడల నవశ్యము నశించు;
ఔషధంబులకై కష్టమందనేల? జడుఁడ! క్రోలుమ! కృష్ణ రసాయనంబు.

దారా వారాకరవరసుతా తే తనూజో విరించిః
స్తోతా వేదస్తవ సురగణో భృత్యవర్గ ప్రసాదః
ముక్తి, ర్మాయా జగదవికలం తావకీ దేవకీ తే
మాతా మిత్రం వలరిపుసుతస్త్వయ్యతోఽన్యన్నజానే.

సతి పద్మాలయ నందనుండజుఁడు నీ సంసేవకుల్ దేవతల్
స్తుతిపాఠుల్ శ్రుతికోటి, మాయ భువనాళుల్, స్నేహితుండాదివ
స్మృతి సంభూతుఁడు, నీ యనుగ్రహమె మోక్షంబిట్టి నిన్గన్న పు
ణ్యతమన్ దేవకిఁ గాఁదలంచెదను; దేవా! కృష్ణ! యల్పజ్ఞుఁడన్.

కృష్ణో రక్షతునో జగత్త్రియగురుః కృష్ణం నమస్యామ్యహం
కృష్ణేనామర శత్రవో వినిహతా కృష్ణాయ తస్మై నమః
కృష్ణాదేవ సముత్థితం జగదిదం కృష్ణస్య దాసోఽస్మ్యహం
కృష్ణే తిష్టతి శర్వమేత దఖిలం హేకృష్ణ రక్షస్వమామ్!

కృష్ణుఁడు ప్రాపు సద్గురుని గృష్ణుని గొల్చెద, దైత్యులెల్ల శ్రీ
కృష్ణుని చేత నీలిగిరి కృష్ణునికై యిడుదున్ బ్రణామముల్
కృష్ణునకంటె వేఱెఱుఁగఁగృష్ణునకున్ భటుఁడన్ సమస్తమున్
గృష్ణునియందుఁబెంపొదవుఁ, గృష్ణ! ననున్ గృపతోడఁ బ్రోవుమా.

తత్త్వం ప్రసీద భగవన్ కురు మయ్యనాథే
విష్ణో కృపాం పరమ కారుణికః కిల త్వమ్
సంసార సాగర నిమగ్న మనంత దీన
ముద్ధర్తు మర్హసి హరే పురుషోత్తమోఽసి!

ఈశ్వరా! ప్రసన్నుఁడవగు, మీ యనాథుఁ గరుణఁగనుమి; దయాబ్ధివికావె? నీవు;
దీను—భవవార్ధి మగ్నుఁడవైన నన్ను నుద్ధరింపంగఁ దగుదు వీ వో ముకుంద.

నమామి నారాయణ పాద పంకజం
కరోమి నారాయణ పూజనం సదా
వదామి నారాయణ నామ నిర్మలం
స్మరామి నారాయణ తత్త్వమవ్యయమ్!

మ్రొక్కెద ముకుంద పాదాబ్జములను భక్తి, సలిపెదను శ్రీ ముకుంద పూజలను సతము
పావనముకుంద నామముల్ పలుకుచుందు సతతము ముకుంద తత్త్వము సంస్మరింతు.

శ్రీనాథ నారాయణ వాసుదేవ
శ్రీకృష్ణ భక్తప్రియ చక్రపాణే
శ్రీపద్మనాభాచ్యుత కైటభారే
శ్రీరామ పద్మాక్ష హరే మురారే!

వాసుదేవ! నారాయణ! భక్తవరద! శ్రీరమాప్రాణనాయకా! కృష్ణ! చక్ర
పాణి! యచ్యుతా! శ్రీరామ! పద్మనాభ! కైటభారి! హరి! మురారి! కమలనయన!

అనంత వైకుంఠ ముకుంద కృష్ణ
గోవింద దామోదర మాధవేతి
వక్తుం సమర్థోఽపి నవక్తి కశ్చిత్
అహో! జనానాం వ్యసనాభిముఖ్యమ్!

శ్రీముకుంద! దామోదర! కృష్ణ! మాధవా! యనంత! వైకుంఠ! గోపాల!-యనుచుఁ
బలుకఁగలిగియు నొక్కరుఁబలుక రక్కటకట! జనములు వ్యసనకాళ్యాభిముఖులు!

ధ్యాయంతి యే విష్ణు మనంత మవ్యయం
హృత్పద్మమధ్యే సతతం వ్యవస్థితమ్
సమాహితానాం సతతాభయప్రదం
తేయాంతి సిద్ధిం పరమాంచ వైష్ణవీమ్!

అవ్యయు ననంతు హృత్పద్మమందు వెలయువాని, నేకాగ్రచిత్తులై భజనసేయు
వారి కభయంబు సమకూర్చువాని విష్ణుస్మరణ సేయువారలు గాంత్రు పరమపదము.

క్షీర సాగర తరంగ శీకరాఽఽ
సార తారకిత చారుమూర్తయే
భోగి భోగ శయనీయ శాయినే
మాధవాయ మధువిద్వషే నమః!

క్షీరనిధి తరంగ శీకరాఽఽసార తారకిత మారకోటి రామణీయ
మూర్తియగుచు భోగి భోగ శయ్యాంబరుండు మాధవునకు నే నమస్కరింతు.

యస్యప్రియౌ శ్రుతిధరౌ కవిలోకవీరౌ
మిత్రౌ ద్విజన్మవర పద్మశరావభూతాం
తేనాంబుజాక్ష చరణాంబుజ షట్పదేన
రాజ్ఞా కృతా కృతిరియం కులశేఖరేణ!

శ్రుతి ధరులుఁ గవిలోక వీరులు ద్విజన్మ
వరుఁడుఁ బద్మశరుండునాఁ బఱఁగ హితులు;
వాసుదేవ పదాబ్జ షట్పదమునైన
ప్రభువు-కులశేఖరాళ్వారు పలికినకృతి
నార్థమొనరించె హనుమ కృష్ణార్పణముగ!

శ్రీ ముకుందమాలాస్తోత్రము సంపూర్ణము.

# శ్రీ కనకధారాస్తవము (శ్రీస్తుతి) – పీఠిక

"శ్రీ కనకధారా స్తవము" అను నామాంతరముఁగల శ్రీస్తుతిని శ్రీమన్నిగమాంత మహాదేశిక బిరుద విఖ్యాతులగు శ్రీమాన్ వేంకటనాథాచార్యులుఁగారు రచించిరి. వీరికి 'కవితార్కిక కేసరి' యను బిరుదును గలదు. వీరి పాండిత్య ప్రతిభా విశేషము లపారములు. శ్రీ వేదాంతదేశికులవారు రచించిన "యాదవాభ్యుదయము" నకు వ్యాఖ్యానము రచించుచు శ్రీ అప్పయ్యదీక్షితులవారు–

"ఇత్థం విచింత్య సర్వత్ర భావాస్సంతి పదేపదే
కవితార్కికసింహస్య కావ్యేషు లలితేష్వపి"

యని వక్కాణించిరి. కావున వీరి పాండిత్యమును గూర్చి వేఱుగ వివరింపఁబనిలేదు. వీరు రచించిన స్తోత్రరత్నములనేకములు గలవు. అందు మృదుపదగుంఫితమైన భక్తి రసముట్టిపడు "శ్రీస్తుతి" యొకటి. ఈ స్తోత్రావతరణమున కొక వృత్తాంతముఁ జెప్పుదురు.

ఒకనాఁడొక బ్రహ్మచారి శ్రీ వేదాంత దేశికులవారి దగ్గఱకేతెంచి "నేను మిక్కిలి పేదవాఁడను. వివాహముఁ జేసికొనఁదలఁచితిని. దానికిఁ గావలసిన ధనము తమవలనఁ బడయఁగోరి యేతెంచితిని" – యని, విన్నవించుకొనెను. అంతట దేశికులవారు, "ఓయీ! నేను ఉంఛవృత్తితో భగవదారాధనము నెఱపుకొనుచుంటిని. నాదగ్గఱ ద్రవ్యమేమికలదు? నేనేమి సాయము చేయఁగలను?" అని పలికిరి. ఆ పలుకులు వినిన బ్రహ్మచారి "స్వామీ! దేవరవారి యనుగ్రహము కలిగిన లభ్యముకానిదేదియు లేదని పలువురు మహనీయులు చెప్పఁగా విని నమ్మివచ్చితిని," యని దీనముగఁ బలికెను. "భాగవతోత్తములట్లు చెప్పియుండిరే నది పొల్లుకాఁజాలదు" అని, దేశికులవారు వచించి ఈ శ్రీస్తుతిని రచించి యొసఁగి "నాయనా! దీనిని పఠించుచు శ్రీ పెరుందేవి తాయారులకు ప్రదక్షిణ మొనర్చుము. ఆ తల్లి యనుగ్రహమున నీకు సకలార్థసిద్ధి ప్రాప్తించును" అని సెలవిచ్చిరి. ఆ దినమెల్ల నా బ్రహ్మచారి యీ స్తోత్రమును బఠించుచు శ్రీదేవికిఁ బ్రదక్షిణించెను. మఱునాఁడు దేశికులవారు – శ్రీ పెరుమాళ్ళవారికి మంగళాశాసనమొనర్ప నరుదెంచిరి. ఆ వటువు వారిని వెంబడించి యీ స్తోత్రరత్నమును జదువుచు శ్రీదేవికిఁ బ్రదక్షిణముఁ జేయుచుండెను. ఆర్తత్రాణ (16) యోగారంభ (17) అను శ్లోకమును పఠించుచుండగా నా తల్లి సన్నిధిని కనకవర్షము గురిసెను. అచటనున్నవారెల్లరాశ్చర్య చకితులై శ్రీదేశికులవారి మహిమను వేనోళ్ళఁగొనియాడిరి. ఆ వడుగును కృతార్థుఁడై యాచార్యులవారి యనుజ్ఞఁబడసి వెడలిపోయెను. ఈ కారణమున ఈ స్తోత్రమునకు

"శ్రీ కనకధారాస్తవము" అను పేరు గలిగెను. భగవదనుగ్రహ పాత్రులగు మహాత్ములకు సాధ్యముగానిది లేదుగదా!

సకలార్థప్రదాయిని యగు శ్రీదేవిని ఈ స్తోత్రరత్నముల స్తుతించి సోదర భక్తులెల్లరు ఆ తల్లి కటాక్షలేశమున ఇహ పరార్థ సంచయములంబడసి సుఖ సంతుష్టి సంతృప్తి శాంతులను బడయుదురుగాత!

శ్రీమాన్ వేంకట నాథార్య కవితార్కిక కేసరీ
వేదాంతాచార్య వర్యోమే సన్నిధత్తాం సదాహృది.

వాసిఁగని "కవితార్కిక కేసరి" యన
"నఖిల వేదాంత దేశికుఁ"డనఁగఁబఱఁగి,
శ్రీనివాస పదాంబుజ భృంగమైన
మాన్య వేంకట నాథార్య మదిఁదలంతు.

శ్రియైనమః

ఓమ్ నమః శ్రీ కృష్ణాయ భగవతే

శ్రీ సాయీ సద్గురవేనమః

# శ్రీ కనకధారా స్తోత్రమ్ (శ్రీస్తుతి)

మానాతీత ప్రథిత విభవాం మంగళం మంగళానాం
వక్షః పీఠీం మధు విజయినో భూషయంతీం స్వకాంత్యా
ప్రత్యక్షాను శ్రవిక మహిమ ప్రార్థినీనాం జనానాం
శ్రేయోమూర్తిం శ్రియ మశరణ స్త్వాం శరణ్యాం ప్రపద్యే!

శ్రీ నారాయణ వత్సపీఠిని విభూషింపఁ స్వకీయద్యుతుల్
మానాతీత విభూతి మంగళకరంబై మంగళశ్రేణికిన్
నానార్థంబుల స్వాశ్రిత ప్రజలకుఁ గల్పించు శ్రీదేవిఁగ
ళ్యాణిన్ దీనశరణ్య నిన్ను శరణం బర్థింతుఁ బద్మావతీ!

ఆవిర్భావః కలశ జలధా వధ్వరే వాపి యస్యాః
స్థానంయస్యాః సరసిజవనం విష్ణు వక్షస్థలం వా
భూమాయస్యాః భువన మఖిలం దేవి దివ్యంపదం వా
స్తోక ప్రజ్ఞైరనవధిగుణా స్తూయసేసా కథంత్వమ్!

జననస్థానమ! నీకుఁబాల్కడలియో – జన్మంపు క్షేత్రంబులో,
కన, నీవాసమ! వాసుదేవు నురమో - కంజాత పుంజంబులో,
జననీ! నీ విభవంబ! దివ్యపదమో - సర్వ ప్రపంచంబొ; యీ
నిను, నిశ్శేష గుణాఢ్యనల్పుఁ డెటు వర్ణింపంగనౌః భార్గవీ!

స్తోతవ్యత్వం దిశతి భవతీ దేహిభి స్తూయమానా
త్వామేవ త్వా మనితరగతిః స్తోతు మాశం సమానః
సిద్ధారంభ స్సకల భువన శ్లాఘనీయో భవేయం
సేవాపేక్షా తవచరణయోః శ్రేయసే కస్య నస్యాత్!

స్తుతిఁ గావించు నరున్ జగన్నుతికిఁ బాత్రుం జేయఁగాఁజాలు దే
గతినిన్ గానసివీఁడు నీ స్తుతికి సంకల్పించు మాత్రన్ జగత్
స్తుతి పాత్రంబగునట్టె! నీ పదములందున్ నిత్య సేవా పరా
దృతి పొందింపదె యేరికేని సకల శ్రేయంబులన్ బద్మజా!

యత్సంకల్పా ద్భవతి కమలే యత్ర దేహిన్య మీషాం
జన్మస్థే మప్రళయ రచనా జంగమాఽజంగమానాం
తత్కల్యాణం కిమపియమినా మేకలక్ష్యం సమాధౌ
పూర్ణం తేజః స్ఫురతి భవతీ పాదలాక్షా రసాంకమ్!

ఇది సర్వంబును దానయై జగములన్ సృష్టించి పోషించి త్రుం
చఁదగంజాలినిజేచ్ఛ యోగిజన లక్ష్యైకంబునై మంగళా
స్పద మిట్టిట్టనరాని నీ విభుని తేజః పూర్ణ రూపంబు నీ
పదలాక్షారస లక్షితంబయి కడున్ భాసిల్లునమ్మా! రమా!

నిత్యప్రత్యూహ్య ప్రణయ ఘటితం దేవి నిత్యానపాయం
విష్ణుస్త్వం చేత్యనవధిగుణం ద్వంద్వ మన్యోన్యలక్ష్యమ్
శేషశ్చిత్తం విమల మనసాం మౌళయశ్చ శ్రుతీనాం
సంపద్యంతే విహరణవిధౌ యస్యశయ్యా విశేషాః!

పెర పొచ్చెంబులు లేని - చేడ్పడని సత్ప్రేమాంక, ముద్యద్గుణా
కర, మన్యోన్య నిరూపితంబయి వెలుంగఁజాలు మీ జంట; యి
ర్వురసంచార విధాన యోగ్యశయనంబుల్ శేష యోగీంద్ర హృ
త్సరసీజ శ్రుతిమౌళు లిందులకు సాక్ష్యంబమ్మ! విష్ణుప్రియా!

ఇరావతి యను నామె అగ్నిమిత్రుని రెండవ భార్య. కావున నీమె కూడ నాగ కన్య గానోపును) తరువాతియాత్రలో హిమవత్పర్వత పార్శ్వమున యగస్త్య వటము హిరణ్యబిందు తీర్థమును వచ్చినవి. ప్రాగ్దేశయాత్రలో నైమిశారణ్యము, (ఇటనారాయణారాధనము), ఉత్పలిని, కౌశికి, నంద, అపరనంద, గయ, గంగ, గంగాసాగర సంగమమును వచ్చినవి. తరువాత సముద్రతీరము మీదుగా బోయిన యాత్రలో కళింగదేశము రాగా నట తోటి బ్రాహ్మణులు క్రమ్మరి యుత్తరకురుదేశముల కరిగిరి. తరువాత పూర్వసముద్ర తీర్థ యాత్రలో పురుషోత్తమదేవదర్శనము, మహేంద్రగిరి, గోదావరి, భీమేశ్వరము, శ్రీపర్వతము, వేంగీదేశవిభవము (ఇది నన్నయయభిమానానీతము. మూలమున లేదు. గనబడినవి. తరువాత దక్షిణసముద్ర తీర్థయాత్రలో కావేరీసాగర సంగమము మణిపురమును వచ్చినవి. ఇట మణిపురపతి చిత్రవాహనుని పుత్రిని చిత్రాంగదను అర్జునుడు పెండ్లాడి బభ్రువాహను డను పుత్రుని బడసెను. ఇట సముద్రమున నున్న సౌభద్ర, పౌలోమ, కారంధమ, ప్రసన్న, భార ద్వాజంబు లను పంచ తీర్థములతో నంద, సౌరభేయ, సమీచి బుద్బుద, లత- అనుకౌబేరులగు నప్సరలు బ్రాహ్మణశాపమున గ్రాహము లైయుండగా నర్జునునిచే శాపవిముక్తలైరి. ఆతరువాతియాత్రలో గోకర్ణము వచ్చినది. పశ్చిమసముద్ర పార్శ్వయాత్రలో ప్రభాసతీర్థము ద్వారకయు వచ్చినవి. ఇట నర్జునుడు సుభద్రను బెండ్లాడెను. తరువాతి యాత్రలో ఆనర్తకదేశము అగణ్యారణ్య పుణ్యతీర్థములు మొదలగువానిని సేవించి యర్జును డింద్రప్రస్థము జేరెను. వీనినిబట్టి భారతకాలమున గిరినద్యాశ్రమభూముల జరించుటలు తీర్థయాత్రలుగా జెప్పబడుచుండె ననియు నిప్పటివలె విశ్వేశ్వరాదిదేవపుణ్యక్షేత్రములు తీర్థ ములుగా నుండెడివి గావనియు దెలియును.

పాండవుల దిగ్విజయములలో భౌగోళిక చారిత్రకాంశములు :- మహా భారతమున పాండవులు చేసిన దిగ్విజయములు మూడు. 1. రాజసూయ దిగ్వి జయము 2. అశ్వమేధ దిగ్విజయము 3. కర్ణ దిగ్విజయము. ఇందు రెండు దిగ్విజయములు పూర్వదిశాక్రమమున వర్ణింపక నుత్తర దిశాక్రమమున వర్ణిం చుట-భారత మున్నది యున్నట్లును, జరిగినది జరిగినట్లును, చూచినది చూచి నట్లును వర్ణించి వ్రాసిన యితిహాసమని తెలియజేయును. ఉత్తరము సుపరి చితమును సుసంబద్ధము నగుటచే పాండవులు తమ దిగ్విజయ యాత్ర నుత్తరము

హరి నీ ప్రీతి కిదంతయున్ నెఱపునమ్మా! వేదసారంబు మీ
రుపూర్, మా కులదైవమో భగవతీ! శ్రీ దేవి! పద్మావతీ.

ఆపన్నార్తి ప్రశమన విధౌ బద్ధదీక్షస్య విష్ణోః
ఆచఖ్యాస్త్వాం ప్రియసహచరీ మైకమత్యోపపన్నాం
ప్రాదుర్భావై రపి సమతనుః ప్రాదుర్భావమన్వీయసే త్వం
దూరోత్క్షిప్తైరివ మధురతా దుగ్ధరాశే స్తరంగైః!

కలకాలంబు శ్రితార్తి నిర్దళన దీక్షాబద్ధుఁడౌ నాథునే
వలనన్ బాయక యైకమత్యము వహింపన్ జాలు దీవందురో
తల్లి! నీ భర్త్రవతారమందుఁ దగుపాత్రన్ దాల్తు; దూరంబులై
కలశాంభోధి తరంగముల్ మధురముల్ గాకుండునే? యిందిరా.

ధత్తేశోభాం హరిమరతకే తావకీమూర్తి రాద్యా
తన్వీ తుంగస్తన భరనతా తప్తజాంబూనదాభా
యస్యాం గచ్ఛంత్యుదయ విలయైర్నిత్య మానంద సింధౌ
ఇచ్ఛావేగోల్లసిత లహరీ విభ్రమం వ్యక్తయస్తే!

హరి నీలద్యుతిమూర్తికిన్ బసిడి ఛాయన్ గేరు నీ సొంపుమే
నరుదౌ శోభనుగూర్చు; మీ పరమ రూపానంద పాథోధి ని
శ్వరసంకల్పజవంబునన్ బొటమువుచు బోకాడు నమ్మా! నిరం
తరమెన్నో నవతార వీచికలు; భక్తానంద సందాయినీ.

ఆసంసారం వితత మఖిలం వాఙ్మయం యద్విభూతిః
యద్భ్రూ భంగాత్ కుసుమ ధనుషః కింకరో మేరుధన్వా
యస్యాం నిత్యం నయన శతకై రేకలక్ష్యో మహేంద్రః
పద్మే తాసాం పరిణతి రసౌ భావలేశై స్త్వదీయః!

ప్రమదాధారమ! సర్వ వాఙ్మయ మహాభాగ్యంబు, ఫాలాక్షుఁగ
న్నొమలాడించిన మాత్రఁబూ విలుతుబంటున్ జేయు నేర్పుగా జిరం
బు మహేంద్రాక్షి సహస్రలక్ష్య విభవంబున్, నీదు సంకల్పలే
శమ—వాణీ గిరిజా శచీసతులు గాంచన్ గల్గుటో భార్గవీ.

అగ్రేభర్తు స్సరసిజ మయే భద్రపీఠే నిషణ్ణాం
అంభోరాశేరధిగతసుధా సంప్లవాదుత్థితాం త్వామ్
పుష్పాసారస్థగిత భువనైః పుష్కలావర్త కాద్యైః
క్లప్తారంభాః కనక కలశైరభ్యషించన్ గజేంద్రాః!

కలశాబ్ధిన్ జనియించి నీ విభుసమక్షంబందు నీవజ్జమం
దలరన్ బూజడి వానలన్ గురియు మేలౌపుష్కలావర్త కా

దుణ వర్షించుచుఁ దోడ్పడన్, సురనదీ తోయంబులన్ హేమ పా
త్రలతో నీ కభిషేకమున్ సలిపె దిగ్దంతుల్; ముకుందప్రియా!

ఆలోక్యత్వా మమృత సహజే విష్ణువక్షస్థలస్థామ్
శాపాకాన్తింతా శరణ మగమన్ సావరోధా స్సురేంద్రాః
లబ్ధ్వా భూయస్త్రి భువన మిదం లక్షితం త్వత్కటాక్షైః
సర్వాకారస్థిర సముదయాం సంపదం నిర్విశంతి!

అమరేంద్రాదులు శాప దుర్వ్యథలపాలై కుంది, గోవిందు వ
క్షముననుండన్ జెలువారు నిన్ను నిజ కాంతాయుక్తులై వేడ; ప్రే
మమునన్ గూర్చితి శాశ్వతాభ్యుదయ సంపత్సంచయంబుల్ కటా
క్షమమాత్రాన; సుధా సహోదరి! జగత్కల్యాణ సంపత్కరీ!

ఆర్తత్రాణ వ్రతిభి రమృతాసార నీలాంబువాహైః
అంభోజానా ముషసి మిషతా మంతరంగై రపాంగైః
యస్యాం యస్యాందిశివిహరతే దేవిదృష్టి స్త్వదీయా
తస్యాంతస్యాం మహమహమికాంతన్వతే సంపదోఘాః

శ్రితసంత్రాణ పరాయణంబులుఁజిర ప్రేమామృతసార సం
భృత నీలాభ్రనిభంబులై యుదయ నీరేజంబులన్ గేరు నీ
చతురాపాంగవిలోచనంబుల దెసన్ సంపచ్చయంబెల్ల నా
తృతి 'నే' 'నే' నని పర్వులెత్తెడిని పందెంబూని; యో యిందిరా.

యోగారంభా త్వరిత మనసో యుష్మదేకాంత్య యుక్తం
ధర్మం ప్రాప్తుం ప్రథమ మిహయే ధారయంతే ధనాయామ్
తేషాం భూమే ధనపతిగృహా దంబరా దంబుధేర్వా
ధారానిర్యాం త్యధికమధికం వాంఛితానాం వసూనామ్.

పరమాసక్తినిఁ గర్మయోగముఁ బొనర్పంగోరి, యే సాధనాం
తరముల్ లేని యనన్యభక్తులకు విత్తంబెల్ల ధారాపరం
పరలై చేకురు నీ కృపన్ ధరణినేన్, బౌలస్త్యుచేనేని, నం
బరమందుండియొ, యబ్ధిమూలముననో; భక్తేప్సితార్థప్రదా!

శ్రియస్కా మా కమలనిలయే చిత్రమామ్నాయ వాచాం
చూడాపీడం తవపదయుగం చేతసాధారయంతః
ఛత్రచ్ఛాయా సుభగశిరసశ్చా మరస్మేర పార్శ్వాః
శ్లాఘా శబ్దశ్రవణముదితాః స్రగ్విణః సంచరంతి!

పరమామ్నాయ శిరోవిభూషలగు నీ పాదాంబుజంబుల్ నిరం
తర సుశ్రేయము ముక్తిం గోరి మదిలో ధ్యానించు భక్తుల్: వసుం
ధర స్రగ్భూషణ చామరాదులను శ్వేతచ్ఛత్రముల్ వాహనో
త్కరముల్ ప్రస్తుతులన్ గడింతు; రిదిచిత్రం—బమ్మ! పద్మాలయా!

ఊరీకర్తుం కుశలమఖిలం జేతుమాదీ నరాతీన్
దూరీకర్తుం దురితనివహం త్యక్తుమాద్యామవిద్యామ్
అంబస్తంబా వధికజనన గ్రామసీమాంతరేఖామ్
ఆలంబంతే విమలమనసో విష్ణుకాంతే దయాంతే!

పరమ శ్రేయములన్నియున్ బడయఁబాపంబుల్ విదారింపఁగా
నరిషట్కంబు నడంప, నాద్యము నవిద్యన్ రూపుమాపంగ నో
హరికాంతామణి! యెల్లపుట్టువుల మేరౌ నీ దయాలేశమున్
శరణంబందుచునుంద్రు నిర్మలమతుల్; సర్వార్థసంధాయినీ.

జాతాకాంక్షా జనని యువయో రేకసేవాధికారే
మాయాలీఢం విభవ మఖిలం మన్యమాన స్తృణాయ
ప్రీత్యై విష్ణోస్త వచకృతినః ప్రీతిమంతో భజంతే
వేలా భంగప్రశమనఫలం వైదికం ధర్మసేతుమ్!

జననీ! మీయుగళంబు దైవమని కాంక్షన్ గొల్చు ధన్యుల్ జగం
బున మాయామయ సంపదావళిఁ దృణంబున్ గాగభావించి, న
ర్తనలన్ వైదిక ధర్మసేతువును మీరన్‌బోక మీకై సమ
ర్పణఁ గావింతురు సర్వమున్; భగవతీ! వాత్సల్యపూర్ణాకృతీ.

సేవే దేవి త్రిదశమహిళా మౌళిమాలార్చితంతే
సిద్ధిక్షేత్రం శమితవిపదాం సంపదాం పాదపద్మమ్
యస్మిన్నీష న్నమితశిరసో యాపయిత్వా శరీరం
వర్తిష్యంతే వితమసిపదే వాసుదేవస్య ధన్యాః!

స్మరియింతున్ సకలాపదల్ గెడపి, పెల్చన్ సంపదల్ గూర్చుచున్
సురనారీమణి మౌళిదామములచే శోభిల్లు నీ పాదపం

కరుహంబుల్; క్షణమాత్రవాలి, నిను ద్రొక్కన్ జాలు ధన్యుల్ తుదిన్
బరతత్త్వంబగు వాసుదేవుపదమున్ బ్రాపింతురో భార్గవీ.

సాను ప్రాస ప్రకటిత దయైః సాంద్ర వాత్సల్య దిగ్ధైః
అంబస్నిగ్ధైః అమృతలహరీ లబ్ధ సబ్రహ్మచర్యైః
ఘర్మేతాపత్రయ విరచితే గాఢ తప్తం క్షణం మాం
ఆకించన్య గ్లపితమనఘై రార్ద్రియేథాః కటాక్షైః!

పరమోదారములై, దయాకరములై! వాత్సల్యపూర్ణంబులై,
నెఱిసొంపుల్ గలవై, సుధాలహరికిన్ నేస్తంబులై, యెందునే
మఱుపాటొందని నీ కటాక్షముల ముంపన్‌జూడు మొక్కింత, ది
క్కఱితాపత్రయ ఘర్మతప్తుఁడయి స్రుక్కంగన్న వీనిన్; రమా!

సంపద్యంతే భవభయతమీ భానవః త్వత్ప్రసాదాత్
భావాస్సర్వే భగవతి హరౌ భక్తిముద్వేలయంతః
యాచేకింత్వామహ మిహయతః శీతలోదార శీలా
భూయో భూయోదిశసి మహతాం మంగళానాం ప్రబంధాన్!

జననీ! సంసృతి భీతి సంతమస భాస్వంతుండు గోవిందు నం
దనువౌ భక్తికి సర్వభావములు లభ్యంబయ్యెడిన్ నీ కృపన్
నిను నౌదార్య దయా విశాల నిఁక వేనిన్ గోరెదన్? సతతం
బును జేకూర్చుచునుంటి మంగళచయంబుల్, వాసుదేవప్రియా.

మాతాదేవిత్వమపి భగవాన్ వాసుదేవః పితామే
జాతస్సోఽహం జనని యువయో రేకలక్ష్యం దయాయాః
దత్తోయుష్మ త్పరిజనతయా దేశికై రప్యత స్త్వం
కింతే భూయః ప్రియమితికిల స్మేరవక్త్రా విభాసి!

సిరి! నా తల్లివినీవు; తండ్రి హరి; ప్రాచీనంపుసంబంధ మి
ద్దర ప్రేమంబున కేకలక్ష్యముగఁ బెంపున్ గూర్చెడిన్; మీకుఁ గిం
కరుఁగావించెను నన్గురుండుకృప; "నింకన్ గోర్కియేఁ?" మంచునీ
చిఱునవ్వుల్ దళుకొత్తు నెమ్మొగము ప్రశ్నింపన్‌గదే! యిందిరా!

కల్యాణా నామవికల నిధిః కాపి కారుణ్యసీమా
నిత్యామోదా నిగమవచసాం మౌళి మందారమాలా

సంపద్దివ్యా మధువిజయినః సన్నిధత్తాంసదామే
సైషాదేవీ సకలభువనః ప్రార్థనా కామధేనుః!

తఱుఁగన్ బోవని మంగళాకరము, నిత్యానందరూపంబు, స
త్కరుణాసీమ, ముకుంద దివ్య విభవస్థానంబు, లోకాళికిన్
వరణీయంబగు కామధేనువు, త్రయీవాఙ్మౌళి మందార సుం
దర దామంబగు నిందిరాంబ సతమున్ వర్తింను నానెమ్మదిన్.

ఉపచిత గురుభక్తే రుద్ధితం వేంకటేశాత్
కలికలుషనివృత్త్యై కల్పమానం ప్రజానామ్
సరసిజ నిలయాయాః స్తోత్రమేత త్పఠంతః
సకల కుశలసీమా సార్వభౌమా భవంతి!

కలిదోషావళిఁబాపి యీ ప్రజకు సౌఖ్యానందముల్ గూర్ప ని
ర్మలభక్తిన్ గురుభక్తిమై కనకధారాస్తోత్రమఁ, శ్రీస్తుతిన్
బలికెన్ వేంకటనాథుఁడీ కృతిఁ బఠింపన్ జాలుధన్యుల్ శుభం
బులమేరౌ ప్రభుతఁ గడింతురు చిరంబున్ శ్రీసతీసత్కృపఁ.

దేవభాషను వేదాంతదేశికుఁడనఁ
బఱఁగు వేంకటనాథ ధీవరుఁడు పలికె
శ్రీస్తుతిగ నొప్పు కనకధారా స్తవంబు;
హనుమ తెనిఁగించె లోకమాతార్పణముఁగ.

శ్రీ కనక ధారా స్తోత్రము [శ్రీస్తుతి] సమాప్తము.

శ్రీ లక్ష్మీనారాయణ స్తోత్ర మంజరియందు సర్వము సమాప్తము.

శ్రీ కృష్ణార్పణమస్తు! ఓమ్ తత్ సత్.

## సమర్పణము

ఆదిశంకర కులశేఖరాగమాంత
దేశికుల వాక్ప్రసూనాళి! దెనుఁగు ఫణితి
మంజరిన్గూర్చి, నీ పదకంజసీమఁ
జేర్చు హనుమను గొనవె! లక్ష్మీకళత్ర!

హరే రామ హరే రామ రామ రామ హరే హరే
హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే
రామహరే! కృష్ణహరే! తవనామవదామి సదా నృహరే!
నామస్మరణా దన్యోపాయం నహిపశ్యామో భవతరణే!